కవితాసామ్రాజ్యము.

శ్రీబాలాత్రిపురసుందర్యై నమః.

# శ్రీసత్యనారాయణమాహాత్మ్యము.

నంద్యాల మునిసిపల్ హైస్కూల్ ప్రధానాంధ్రపండిత
కావ్యతీర్థ మద్దులపల్లి. వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి
ప్రణీతము.



చెన్నపురి :

వావిళ్ల ప్రెస్సున ముద్రాపితము.

1929.



వెల 0-12-0

శ్రీ మేధాదక్షిణామూర్తయే నమః.

# అవతారిక.

సంసారవిషవృక్షస్య ద్వే ఫలే అమృతోపమే,
కావ్యామృతరసాస్వాద స్సల్లాపః సజ్జనై స్సహా.

ఆర్యపాఠకమహాశయులారా !

ప్రతివ్యక్తికిని యథోచితకర్తవ్యతావిధిని విధించుచున్న 'ఉదుత కుదుతభక్తి' యను సామెత ప్రకారము గురుకులవాసము చేసి సంపాదించిన భాషాదేవి కరుణాకటాక్షవీక్షాపాత్రత్వమున కీడుగాఁ జిన్ని వైనను నీకృతిని నాచే రచియింపించి నన్ను విద్వజ్జనాళిపాత్రునిఁ గాఁ జేసిన భగవత్సంకల్ప మునకుఁ గృతజ్ఞుఁడనై మెలంగుట నాప్రథమకర్తవ్యమై యున్నది.

కాలమహిమమునుబట్టి యొకమాట తక్కువయు, రెండుమాటలెక్కువయు నై యొకటిన్నరమాటగా నుండవలసినట్లు తేలుచున్నది; కావున నీ గ్రంథరచనోద్యమమునకుం గలయాభ్యంతరకారణముల నింతవఱకే పీఠికా భాగమునఁ జెప్పుకొనియుంటిని గనుకఁ దద్విషయమును మాని తదితరవిషయ ములను సాధ్యమైనంతలో నుతి మించి రాగానఁ బడకుండనే విశదీకరింతుఁ గాక.

## గ్రంథరచనకు నిదానము.

భగవానుఁ డనుగ్రహించినవాక్కుకలిమిని రిత్తపుచ్చక తదనుగ్రహా మునకు నిష్కృతిం గోరి యేదే నొక్కప్రబంధము నిబంధింప సమతూహా

లుండ నై యుండఁగాఁ గాశినుండి తిరిగి వచ్చునపుడు మార్గవ్యయమునకై కొంతధనము వలసి యర్థిజనకల్పక మని వినికిం జేసి శ్రీ శ్రీ పిఠాపురము మహా రాజావారిని దర్శించుటకుఁ గాఁ గొన్ని పద్యములు వ్రాసికొని పిఠాపురములో దిగి యాస్థానకవీశ్వరులవలనఁ దప్రత్యవిషయవిశేషములం దెలిసికొని హఠా త్తుఁడ నయ్యుఁ గృతి భర్త్రాదిసంపన్నగృహస్థు లున్నా రని వారివలననే విని తద్వాస్తవ్యగృహముఖద్వారములకన్నను మిన్న యైననాసతోఁ బోయితిని. మధ్యాహ్నము 3 గంటలనుండి రాత్రి 7 గంటలవఱకును గాళ్లకు శనిపట్టెను; గాని యెట్టకేలకు లభించినది యసలుమొత్తమున కీషద్వైషమ్యముగ 3¼ భాగముచేర్చిన నొక్కరూప్యము. అదియుఁ బన్నిద్దరిలో ముగ్వురు మహా దాతల యౌదార్యగరిమమున లభించినదే.

నవీనదీనభావస్య యాచమానస్య ధీమతః,
వచో జీవితయో రాసీ త్పురోనిస్సరణే.రణః.

అన్నట్టు లావేళ నాసంగతి యట్లుండెను. అంతకన్న నతిశయముగా నాశ్లోకమునఁ జెప్పి యుండలేదు గాని యట్లు గూడ నుండు నని చెప్పవలసి యున్నది. మనసునందు భావపరంపరలు కుప్పతెప్పలుగాఁ బొరలసాగెను. పద్యరూపమును దాల్ప మొదలిడెను. చేతఁగాకున్నంగూడ గోత్రదాయా ద్యమున మాకూచిమంచి జగ్గకవి యంశము కొంతవుఁ గొంతైనఁ బట్టవలసిన స్థితిలో నుండెఁ గాని క్షేత్రబలము లేమి నుపశమిల్లుచుఁ దద్భావనాప్రపంచ మంతయును క్రమముగాఁ బద్యరూపమును దాల్చెను. నాయనుభవసిద్ధాంత మైన యీవిషయమును వృథాపోనీయరా దని తదనుకూలప్రబంధరచనకై పెద్దయుం బడ వారయుచుండఁగా నీసత్యనారాయణమాహాత్మ్యము పొడ కట్టెను. ఇయ్యదియే యీగ్రంథరచనోద్యమమున కాదికారణ మయ్యెను. ఇంతకును దత్సంపన్నులు మహోదారులై యున్నను గూడ వారియాద రణమును సంపాదింపలేనిశక్తిలోపము మనదియకా తలంచుటయే గాక

మీఁదుమిక్కిలి యీగ్రంథరచనమునకు వారివలని తిరస్కారమే మూల కారణ మయ్యె నని కొంతొక్కసంతోషమును వెలిఁబుచ్చుచున్నాఁడను.

ఆయు ర్విత్తం గృహచ్ఛిద్రం మంత్రమైథున భేషజమ్,
తపో దా నావమానం చ నవ గోప్యాని యత్నతః.

అని చెప్పినట్టు లీవిషయముకూడ నవగోప్యములలోఁ జేరినదేయయి నను నింతదూరము పైకిఁ దెచ్చుట యెందుల కనఁగా రాళ్లలో రత్నము వోలెను, విషములో నమృతమువలెను సంకటములోనే సంతోషమును, దుఃఖములోనే సుఖమును, వైరములోనే స్నేహమును, దారిద్ర్యములోనే భాగ్యమును, అవమానములోనే బహుమానమును, చెడుగులోనే మంచిని, అపకారములోనే యుపకారమును నిమిడించి సృష్టించిన పరమేష్ఠిసృష్టి విధాన వైచిత్ర్యమును జూచి సంతోషించుటకొఱకే యని చిత్తగింతురుగాత. 'యస్యానుగ్రహ మిచ్ఛామి తస్య విత్తం హరా మ్యహమ్' అని ప్రతినవట్టిన భగవానుఁ డంతపని చేసి తీఱును గాఁబోలు !

## రెండవకారణము.

భారతి చిన్నతనాన మాకవితాకుమారిని దగ్గఱఁ దీసి యూవచ్చిరాని పలుకులనే విని బుజ్జగించుచుండునది; గనుక భారతిపత్రికలోఁ బ్రకటించుటకై మొట్టమొదట నొకతాపసాశ్రమమును వర్ణించి యిప్పటిప్రథమాశ్వాసములోని యాదిపద్యములను వ్రాసితిని. ఇంతలోపలన యాయూహ నైమిశారణ్యముదాఁకఁ బోయెను. అటనుండి 'ఏకదా నైమిశారణ్యే ఋషయ శ్శౌనకాదయః' అనుశ్లోకము జ్ఞప్తికి రాఁగా దానితో మేళవించెను. మొదటిమూలసూత్రము స్ఫురింప నప్పుడు నామనిర్ధారణముఁ జేసికొని దీనిని వ్రాయ నారంభించితిని.

## గ్రంథరచనాదికము.

ఇందుఁ దృతీయాశ్వాసములో 10 పద్యములవఱకుఁ జెన్నపురిలోనే వ్రాసి యీవల నంబ్యాలలోఁ బూర్తి చేసితిని. దీనికి మాతృకాగ్రంథము చెన్నపురిలో నున్నంతవఱ కచట నున్నయది యొక్కప్రతి. అటు తొలఁగిన తరువాత విశాఖపట్టణం జిల్లా ఖాసింకోట వాస్తవ్యులు బ్రహ్మశ్రీ కూచిమంచి లక్ష్మీనరసింహముగారిచేఁ గూర్పంబడి దైవజ్ఞభూషణు లగు బ్రహ్మశ్రీ తోపల్లి వేంకటరామసిద్ధాంతిగారిచేఁ బరిశోధింపఁబడిన ప్రతిం జూచి వ్రాసితిని. అప్పటి కన్నిప్రతులను జక్క పోలికగా నుండు ననియే నాతలంపు గాని నొండొంటిని బోల్చి చూచినవాఁడను గాను. ఇటీవలఁ గొన్నిప్రతులం జూడఁగాఁ జాల వ్యత్యాసముఁ గన్పట్టినవి. కావున నిది సాధారణ మైనమూలగ్రంథముతో భేదించుట కిదియె కారణముగాఁ జిత్తగింపఁగోరెదను.

కొన్నిప్రతులయం దైదధ్యాయములుగను, గొన్నిట నేడధ్యాయములుగను మఱికొన్నింటఁ దొమ్మి దధ్యాయములుగను భిన్నభిన్నముగాఁ గన్పట్టుచున్నవి. 5 అధ్యాయములతోడనే వ్రతము పూర్తి చేయుట సాంప్రదాయముగా నున్న దనియు, నారదుఁడు భగవానునితో

"కిం ఫలం? కిం విధానం చ? కృతం కేన చ తద్వ్రతమ్?

తత్సర్వం శ్రోతు మిచ్ఛామి ... ... " అని

ప్రశ్నించినదానికి భగవానుఁడు చెప్పుటలోఁ గొంతయుఁ, దృతీయాధ్యాయములో వ్రతదీక్షితుఁ డైనరాజు సాధువునకుఁ జెప్పుటలోఁ గొంతయు ఫలవిధానములు రెండును జెప్పంబడినవనియు, 'కృతం కేన చ తద్వ్రతమ్' అను ప్రశ్నమునకు నిదర్శనము చూపుచుఁ దృతీయాధ్యాయములో

చాతుర్వర్ణ్యైర్వ్రతం కార్యం స్త్రీభిర్వా పురుషై రపి. అని

చెప్పఁబడినప్రకారము బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులలో స్త్రీలు గాని

పురుషులు గాని చేయవచ్చు నని చెప్పినదానికి సాదృశ్యముగా ద్వితీయాధ్యాయములో బ్రాహ్మణుఁడును, తృతీయాధ్యాయములోను, పంచమాధ్యాయములోను క్షత్రియులును, చతుర్థాధ్యాయములో వైశ్యుఁడును స్త్రీలును, పంచమాధ్యాయములో శూద్రులును వ్రతము చేసి రని చెప్పుటతో సరిపోయె ననియుఁ గొందఱు పెద్దలు చెప్పుదురు. మఱియు వ్రతము చేయుదు నని చేయనివాని కనర్థములు గల్గు ననుటకు సాధువైశ్యునియగచాట్లును, అబుద్ధి పూర్వకముగా చేసియుఁ బ్రసాదమును దిరస్కరించినచో ముప్పు వాటిల్లు ననుటకుఁ గళావతీ దౌర్భాగ్యమును, బుద్ధి పూర్వకముగాఁ బ్రసాదమును నవమానించినచో నాపద ఘటిల్లుననుటకుఁ బంచమాధ్యాయములోని భూపాలునిదురవస్థయును దృష్టాంతములుగాఁ జెప్పఁబడుటచే నింతటితోనే ఉపోద్ఘాతము చరితార్థ మయ్యెంగాన నైదధ్యాయములతోనే సమాప్త మయ్యె నని చెప్పుదురు. ఇంతియ గాక 9 వ యధ్యాయములో సత్యదేవునను గ్రహమున జన్మించినవాఁడా పుత్రుని జన్మవిషయక మైనచర్చలో

దైవానుగ్రహమాత్రేణ సుతోత్పత్తి ర్భవిష్యతి,
మాతుః క్షీమకవే ర్భార్యాః పుత్రోత్పత్తిశ్చ న శ్రుతా?

అని భీమకవి జన్మవృత్తాంతము దృష్టాంతముగాఁ జెప్పఁబడినది. ఆభీమకవి వేములవాడ భీమకవియే యని తెలుఁగులో నర్థము వ్రాసిన వారు గూడ స్పష్టముగా వ్రాసి యున్నారు. కనుక శాస్త్రసాంప్రదాయ మెట్లున్నను దీని వలన స్కాందపురాణాంతర్గత రేవాఖండమునందలి యీగాథ కంతకును మిథ్యాత్వకల్పన ఘటిల్లెను ననియుం జెప్పుటచే నుక్తార్థసిద్ధియయినంతటి తోనే యీకృతి గూడ ముగింపఁబడినది.

## గ్రంథ విస్తృతి.

ఇందుఁ గథాంశముపట్ల మాతృక ననుసరించి యథోచితముగ వర్ణన భాగమున నించుక పెంపకము చేయఁబడిన దని పాఠకలోకమే యెఱిం

గెడిని. అయినను దిఙ్మాత్రముగ నొకటి రెండుచోట్లఁ దెలియపఱచుట తప్ప గాఁబో దనుకొందును.

ద్వితీయాధ్యాయములోఁ గాశీపురబ్రాహ్మణునికి భగవానుఁడు ప్రత్యక్ష మగుట రెండుశ్లోకములతోనే ముగిసినది. ఇట 25 పఱకుఁ బెరిఁగినది. తదుపరి భగవానుని యంతర్ధానము పదినాల్గుశ్లోకములలోనే యయినది. ఇట 20 పఱకును బెరిఁగినది. ఇట్లే సాధుకుటుంబమునకుఁ బట్టిన దురవస్థయు, యాత్రాప్రకారమును మున్నగుచోట్ల విస్తారముగా సాగినది. ఇందాయా ఘట్టములయం దిష్టదైవముల చేదోడు వాదోడునకుఁ గృతజ్ఞతాస్తోత్రపూర్వకవందనములు.

## అనుకరణ విషయము.

కావ్యములయం దొక్కపోలిక గలపద్యములం జూచి సర్వసాధారణముగా ననుకరణ మనుమాటయే మనకు వాపాటమైపోయినది. మహామహాకవిసార్వభౌములే యిందులకు గురి యగుచుండఁగా నస్మదాదులు తప్పించుకొందు రనుట కల్ల. అదిగాక. విషయైక్యమునం దొక్కభావమే గాక పదములు మొదలు పాదములు మొదలు పద్యములవఱకును నైక్యము గలుగుచుండుట సహజ మనియుఁ, గొన్నియెడల ననుకరణ ముండినను నదేకవితృప్తితోడనే యున్నిచోట్ల వల్ల ననుకరణతాదోషమునకే యీడ్చుట సత్యదూరమనియు మనవి చేయఁదగి యున్నది. ఇందుల కొక్క దృష్టాంతమును జిత్తగింతురుగాక.

మాకవితాకుమారి యేడాది నాఁడ పిండసిప్రాయములోఁ గవితారచనాజిజ్ఞాసతో

మ. పదలాలిత్యము నర్థగౌరవము భావప్రౌఢియుం రీతియో
గ్యదశల్ ... ... ...

అని పల్కెను. ఇటీవల నొక రాఘునికకవితా విమర్శ చర్చలో గుణ పక్షము నందు శ్రీవడ్డాది సుబ్బారాయకవిగారి భక్తచింతామణిలోని పద్యములు చదువుచుండఁగా నందు

మ. పదలాలిత్యము నర్థగౌరవము భావవ్యక్తి సారస్యసం
పద ... ... ... ...

అను పద్యము వచ్చెను. అంతవఱకును ఆగ్రంథ మున్న దనియే గాని యందలిపద్యములు విన్నవాఁడను గాను. అప్పుడు మనము సాధారణముగా 'శతాంధాః కూపం ప్రవిశంతి' యన్నట్లు లోకరిని జూచుకొని యొకరు భావించుకొను భావన యంతయు మిథ్య గదా! యని యప్పుడే వారలతో నీవిషయము వెల్లడించితిని. ఇంతియగాక కవితారచనం గూర్చి నారచియించి నపద్యములలోని యభిప్రాయముతో సర్వవిధముల నేకీభవించు పద్యములే బ్రహ్మశ్రీ శతావధాని అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రిగారి కవితానియమములం గుఱించి వ్రాసిన పద్యములలో నుండె నని శ్రీశాస్త్రిగారితో ముచ్చటించి వచ్చిన మామిత్రు లొకరు నాతోఁ జెప్పిరి. వారిగ్రంథ మింకను ముద్రిత మైనదో లేదో? కనుక విషయైక్యమునందు నేను మొదట మనవిఁ జేసికొన్నంతవఱకును నేకీభావముండు నని నొక్కి చెప్ప బుద్ధి పుట్టెడిని. సృష్టిలో మానిసింబోలుమానిసి యున్నాఁ డని వినుచున్నాముగదా? ఒక్కమనవి. మార్కాపురము శ్రీచెన్నకేశవస్వామి దేవాలయ ముఖమండపమునం దన్న దమ్ముల స్తంభము లని యిప్పటికిని సుప్రసిద్ధములైన రెండురాతిస్తంభములున్న వి. ఇద్దఱు శిల్పులన్నదమ్ము లాదేవాలయమును గట్టుచు శిల్పకళాపాండిత్య మునందుఁ దారతమ్య స్పర్థతో వివాదపడి 'యిరువురును నడుమ నొకతెర యడ్డము గట్టుకొని చెరియొకరాతిస్తంభముపైఁ దమతమ పాండిత్యమును జూపవలసిన' దని మహాజనులచేఁ దీర్మానించుకొని యట్లే యొనరించి చూపఁగా రెంటికిని సీషమైనను భేదములేక యొక్క పోలికన యుండె నని యంద

అను నాశ్చర్యము నొందిరని చెప్పికొందురు. ఆ స్తంభములే యీయన్నపమ్ముల స్తంభము లని యందురు; కావున దేశ కాల వ్యక్తి భేదము లున్నను విషయైక్యమునం దొంటొంటిని బోలియుండుట సహజ మని మనము నిర్ధారించుకొనవచ్చును. కనుకనే పూర్వప్రబంధములయందు వర్ణనభాగమున నేమి తక్కినచోట్ల నేమి యేకీభావము గన్పట్టుచున్న దని మనము దోషప్రకటనమున కీడ్చుట సత్యమునకుఁ గొంత దాపుగాదేమో! యని నాకుఁ దోఁచెడిని. అట్లని యనుకరణమే లేదని యనుట గాదు. ఉండిన నుండవచ్చును. ఉన్న విగూఢ. అట్టిస్థలము లప్పుడే యెవరయాత్మక వారికే స్ఫురింపక మానవు. అట్టియాకర్షణశక్తి యామనస్సునకుఁ గలదు; కనుకనే ప్రాజ్ఞులు 'సతాం హి సందేహపదేషు వస్తుషు ప్రమాణ మంతఃకరణ ప్రవృత్తయః.' అని వక్కాణించి యున్నారు. అనుకరణ విషయములో సత్య మెంతవఱకో! యసత్య మెంతవఱకో! మనచే నుదాహరింపఁబడుచుండునవి ప్రతిప్రబంధము నందును ననేకములు గలవు. వాని నెల్ల నిందుఁ జూపించుటవలన గ్రంథవిస్తార మయ్యెడుఁ గాన నది మాని యీ గ్రంథములోఁ బూర్వులసూక్తుల ననుసరించినపట్లు దెలియపఱచుకొనియెదను గాక.

ద్వితీయాశ్వాసములో 3 పద్యము ఒకానొకప్పుడు శ్రీ మాగురుపాదులసన్నిధి కొక గ్రంథము పరిష్కరణార్థము రాఁగా దానిని నన్నుఁ జూడ మన నం దిట్టిపద్యమే యొక టుండెను. దానిం జూచి నే నానందించితిని గాని దానికి మూలము వసుచరిత్రలోని దని శ్రీ గురుపాదులు చదివిరి. అందులోని 'శయముచే వ్యాకుశేశయముచేత' అనునది మనసులో నాటి తాదృశ మైనపద్యము మన మొకటి వ్రాయఁగలమా? లేమా? యన్న పట్టుదలతో నప్పుడే యొకపురవర్ణనముగా నీపద్యము వ్రాసితిని. అది సందర్భోచిత మని కొంచెపాటిమార్పుతో నిందుఁ జేర్చియు విమర్శకులయాక్షేపణములను జూచి తీసి వేయఁ దలంపఁగా నొకమిత్రుఁ డొకకొంతహితబోధ

ముతో వారించుచుండేసి యట్లు వ్రాయుంచితిని. ఇందుఁ గొన్ని పద్యము లప్పు డప్పుడు ప్రస్తావికముగనో మఱి యేదో సందర్భములోనో చెప్పంబడి నా యల్పబుద్ధికి నచ్చినవిగాఁ దోఁచఁగా వానిం బోలిక యనుకూలస్థలములలోఁ జేర్పంబడినవి కలవు. వాని వానిని విడఁదీసి చెప్పుట విస్తార మగును గనుక మానుదును గాక.

చతుర్థాశ్వాసములో 'మినుకులు వజ్రముల్ మనసు మెత్తనగాదె ఫలామరాళికిన్' (౨౬.) అను అర్థాంతరన్యాసమునకు 'సింహాసనంబు' అను భారతపద్యము మూలము.

'ఆరయ జంతుజాలమున కంటకికిన్' (౪ ఆ. ౩౧.) అనుపద్యకల్పనము 'ఆహారనిద్రాభయమైథునాని' యను శ్లోకైకదేశమును; 'కరుణోద్దీపకదీన వాక్కుల' (౪ ఆ. ౩౩.) అనుపద్యమునకు 'యాచమానజనమానసవృత్తేః' అను నైషధశ్లోకాంశమును; 'శ్రోతలు జ్ఞాతలు గల్గిన' (౧ ఆ. ౧౨౦.) అను పద్యమునకు 'శ్రోతరి జ్ఞాతరి ప్రాప్తే' యనుశ్లోకమును; 'ఉండినవాఁడు రాఁడు' (౪ ఆ. ౩౨.) అనుపద్యములోనిభావైకదేశమునకు 'మూర్ఖో న హి దదాత్యర్థం' అనుశ్లోకమును; 'చెలమల్ చల్లుకోలంది' (౪ ఆ. ౩౬) అను పద్యములోని భావైకదేశమునకు 'పత్రం పుష్పం ఫలం తోయం' అను గీతాశ్లోకైకదేశమును; 'వేదవేత్త యైనవిప్రోత్తమునియందు' (౪ ఆ. ౩౮.) అనుపద్యైకదేశమునకు 'యావతీర్వై దేవతాః' అనుశ్రుతియును నాధారములు. యాచకుఁడు చాతకదశకుఁ బోయి చెప్పుకొనుమాటలే గనుక నిట్లు పొందుపఱచితిని. ఇంకను నిట్టివి రెండుచోట్ల నుండునేమో! ఇంతకుఁ దప్ప మఱొకచో ననుకరణమని తోఁపట్టుఁగాక నా పని భావించుట సత్యము. సత్యము స్వధర్మనిష్ఠ మయియే యున్నచోఁ దన స్వరూపమునే యందఱహృదయము లందును దోఁపఁజేయుఁగాక.

భాగవతములోని 'నల్లనివాఁడు' అనుపద్యమునకు 'చల్లనివాఁడు' (పీ. ౫౧.) అనుపద్య మనుకరణమా యని మామిత్రు లొకరనిరి. అప్పుడు

సత్యమును దెలియపఱచితిని. నమ్మిరో లేదో! నావద్దఁ జర్మన్ ప్రింటింగ్ మహావిష్ణుపటము న్నది. ఆదివ్యమంగళవిగ్రహము వైపు చూచినపు డెంత లేని మనోవ్యథలున్నను బటాపంచలై యానందము గలుగక మానదు. ఆ పద్యములోనా పటమును జూచితిని. సత్యబద్ధులరై. మఱియు నారదుఁడు ప్రసన్నుడైనభగవానుని దర్శనములోని (౧ ఆ. ౧౦౦.) పద్య మాముక్తమాల్యదలోనిపద్యమును జూచి వ్రాసినట్లున్నదే యని యొకమిత్రుఁ డాపద్యమును జదివెను. ఆపద్యమును వినుట కదే మొదటితడవ యనుట యసత్యము గాదు. మొదటినుండియు నా కొక్కయూహ జనించుచుండెడిది. 'వేఁప పిల్ల కేఁత నేర్ప నక్కఱ లేదు' అని. అనుకరణవిషయములో మన మనుకొనుచున్న వన్నియుఁ గేవలసత్యములే గావు. ఇందువిషయమై ప్రత్యక్షప్రమాణ మింకొకటి మనవి చేయుదునుగాక.

విజయనగరము మహారాజావారికాలేజీపండితులు కవిరాజు మల్లాది వేంకటవిశ్వనాథశర్మగారు శివపురాణము వ్రాయుచు రెండేండ్లక్రిందట నిచటికి వచ్చినపుడు వారితో మైత్రి యబ్బెను. ఒండొరుల మొక రొకరిగ్రంథములను జదివి వినిపించుకొంటిమి. వారిపురాణములో శివుని సందర్శించిన ఘట్టములోఁ జతుర్థ్యంతములతో సంస్కృతములో రెండు సీసపద్యములు గాపోలు నడచియున్నారు. ఇందు నారదుఁడు శ్రీహరిని దర్శించుఘట్టములో నట్లే రెండుసీసపద్యములు చెప్పఁబడినవి. అప్పు డొండొరులము వ్యక్తిభేదముతప్పఁ బక్కిన వస్త్వైక్యమున కాశ్చర్యపడి యనుకరణమును గుఱించిన ప్రవాదమును గూర్చి కొండొక్కయాలోచించుకొని ముందు వెడలిన గ్రంథమును జూచి తరువాతివారు దాని ననుకరించినా రను ప్రవాదము వచ్చునేమో! యని కొంతదూర మనుకొంటిమి. ఇదియే గాక యింకను గొన్ని చోట్ల నొండొంటిం బోలినఘట్టము లున్నట్లు జ్ఞప్తి. ఈయైక్యమున కట్టి భావస్ఫురణలు ప్రకృతిసిద్ధము లనుట తప్పు గా దనుకొందును.

ఇం దొక్కొక్క పద్యమునుగుఱించి చెప్పవలసినవిషయ మంతో యింతో యుండకపోదు. కాని యది యిట్టిచో ననువుపడునది గాదు. అయినను శాస్త్రముగ నొకటి రెండింటికైనఁ జెప్పక విడువరాదు. భగవద్దర్శనములోనిపద్యమునకు 'కెందమ్మియందమ్ము జిందించుసుందరచరణారవిందముల్ నెరయువాని' అను నాలవపాదముయొక్క యల్లికబిగిబిగియే పద్యావతారమున కంతకును హేతుభూతమయ్యెను. కవితాశిల్పమునందుఁ గష్టసుఖము-లనుభవైకవేద్యములే గాని చెప్పినంతమాత్రముతోఁ దెలియుట మహాకష్టము. ఇట్లే ద్వితీయాశ్వాసములో 12 వ పద్యము 'కడుపులో అంపపుఁగోఁతలట్లు' అనుదానింబట్టి యెకఁబ్రాఁకంబడినది. ద్వితీయాశ్వాసము వ్రాయుచున్నప్పు డొక్కయానందవేళ.

ముడి వోని కొడగాని మడుఁ బూని తుదిలేని
పదిలంపుభక్తిని బదిలపఱచి

అని యొకసీసపాదము దొరలెను. అది చతుర్థాశ్వాసములోఁ జిట్టచివరనఁ దాదృశము లైనపక్కినపాదములతోఁ బద్యరూపమును దాల్చెను. ఒకదానిం జూచినచో వ్రాయఁ దలపెట్టుకొన్నచో సందడిలి చిత్రవిచిత్రంపునడక లన్నియు నడపవచ్చునేమో! అది లేనిచో యథాశక్తి కల్పితములుచాలవా యనునైరస్యముతో నుపేక్షితములయ్యె నని యాథార్థ్యము నెఱింగించు-చున్నాఁడను. సామాన్యముగా

తెఱవా! కఱవా? పెఱవారిమాటలున్
దీనశరణా! కరుణా వరుణాలయాశయా!
మగువా! తగవా! మగవారితోడుతన్

అని యిట్టివి ముందుగాఁ గూర్చుకొనుట యభ్యాసము. అవసరపడినచో మీఁదిభాగము పూరించి సందర్భమునం జేర్చుకొనుట యలవాటు. అట్టివి దీనిలోఁ గొన్ని గలవు. అర్థాంతరన్యాసములలోఁ గొన్ని యేతాదృశములే.

అంత్యానుప్రాస మన్న నాకవితాసమాధికిఁ జిన్ననాఁటనుండియు మఱి యెక్కువ మక్కువ. దీనికి నిదర్శనము కవితాప్రాప్తిలోని యారంభ పద్యములు శ్లోకములే. చిన్నప్పటినుండియు నేదో యొకరూపముగా సామె తలం గూర్చుట వాడుక.

## ఆక్షేపణసమాధానములు.

తెలిసినవా రాక్షేప్యవిషయములం దెలియఁ జెప్పుదురు. తెలియని వారివలన నేచిక్కును నుండదు. తెలిసితెలియనివారి యాక్షేపణములకు సమాధానము చెప్పుటయే కొంచెము కష్టము. 'అడిగేవానికి చెప్పేవాఁడు లోకువ' యని యొకసామెత చెప్పుదురు. అడిగినప్పుడే తగినసమాధానము చెప్పుటకుఁ బ్రతిదానికిని వలనుపడక పోవుటయుఁ గల్గెను. ఒక యుదాహరణము.

ప్రత్యక్షరగండ మాకవితజాడల్ కత్తిపై సాము; సాగిన నానంద
మహోదయోర్మిలహరీకేళియశఃప్రాప్తి (పే. 80.)

'ఇట లహరీశబ్దము నదియందే గాని సముద్రమునందు లేదు గనుక నిది య సంగతము' అని యాక్షేపణము. తాత్కాలికముగా నేదో సమాధానము చెప్పఁబడెఁ గాక పూర్వప్రయోగమునకై ప్రాఁకులాడఁగా గురుబాల ప్రబోధికలో

శశ్వ త్తృశ్యత శబ్దవార్ధిలహరీ విద్యోల్బణమ్ (తృ. కాం. నానా. ౨౮౫) అని కనఁబడినది. అప్పుడు వారి యాక్షేపణమువలన నాకుఁ గల్గిన చిచ్చుపా టంతయుఁ బోవుటయ గాక చాలవఱకు నాధునికకృతి యన్న యల్పదృష్టితో నవిమర్శమూలముగా నాక్షేపించువారియాక్షేపణము లన్నియు నిట్టివె కా దృఢజ్ఞాన ముదయించెను. అట్లని తప్పులే లే వని కాదు. తప్పులు లేనిచోటనే యుండ వని నానమ్మకము. భిన్నరుచి ర్హి లోకః. పుణుక

కొకబుద్ధి. జిహ్వ కొక రుచి. రోటి కొకపాట. నోటి కొకమాట. ఒకరి నొకరాక్షేపింపఁగా వారిని వేఱొక రధిక్షేపించుచున్నారు. వారిని మఱొక రెత్తివేయుచున్నారు. ఈఁగకై కప్ప చూచుచున్నది. కప్పకై పాము కాచుచున్నది. పాముకై ముంగి పొంచుచున్నది. ముంగికై మానవుఁడు వేచుచున్నాఁడు. ఇది సృష్టినైజమే గాని విరుద్ధము గాదు. ఏమీ లేనిచో నాక్షేపణలపై నధిక్షేపణలతో గ్రంథములపై గ్రంథములు పుట్టి భారతీ కంఠహారమునందు సుమాయితము లగుట యెట్లు? ఇయ్యదియుఁ బ్రాచీనసాంప్రదాయకముగా వచ్చునాచారమే గాని క్రొత్తది కాదు. అట్లు గానిచో మహాకవి కాళిదాసుని భావనాప్రపంచములో

పురాణ మిత్యేవ న సాధు సర్వం న చాపి కావ్యం నవ మిత్యవద్యం

అను కల్పన కవకాశ ముండదు.

కాళిదాసమయూరాది కవుల కెల్లఁ
గలవు తప్పు లనంగ నన్యులకు లేవె? (అప్ప. పే. 28)

అని చెప్పఁ బడినది. మహాప్రాజ్ఞులైనయంతవారే యట్టిగతిఁ బట్టినప్పు డిఁకఁ గించిజ్ఞమ్మన్యులయిన యస్మదాదులవిషమా యాలోచన?

## జిజ్ఞాసా ప్రార్థన.

చిన్ననాఁటి మా కవితాకుమారి వచ్చిరాని యవ్యక్తపదములను గొన్నింటిని, గొందఱపండితమహాశయుల ప్రమాణవాక్యముల నాధారము చేసికొని యనభిమతములు గా నున్నను నిప్పటి కసంస్కృతములుగానే యుంచుచితిని. ఇం దేవేని దోసఁగులు పొసఁగి యుండవని మనవి చేయఁజాలను. అట్టివెల్లఁ గవికన్నఁ బాఠకరసికవతంసులకే పొడకట్టెడు. సౌహృదంబు నెఱపి శాస్త్రరీతిచేఁ దప్పుని తోఁచువానిని దయచేసి తెలుపఁ బ్రార్థించుచున్నాఁడను. తెలుపుచోఁ గృతజ్ఞతాపూర్వక వందనములతోఁ బునర్ముద్రణ

మునందు సవరించుకొందురు. లేదా సమాధాన మున్న మనవిచేయుదును. మఱియు రెండుమాతృకలం జూచి వ్రాయంబడిన పగుటచే నాదిభాగమున రెండవమాతృకలోని విషయము లించుక విస్తరింపవలసినట్లు దిఙ్మాత్రదర్శనమున నగపడెడు. అనభిమతవిషయముల నన్నిటిని బునర్ముద్రణభాగ్యమున్న సవరించుకొందు నని మనవి చేయుచున్నాఁడను.

## గ్రంథ ముద్రణము.

గ్రంథము చిన్నిదైనను ననధికప్రజ్ఞునిచే సంతరింపఁబడుటం జేసి యాధ్యాత్మికాదితాపోపహత మైనకాలము మూఁడుపాళ్లు గాఁగా నొక్క సంవత్సరము మీఁదట నైదు మాసములు పట్టవలసి వచ్చెను. ముద్రణార్థమై కేవలదైవప్రయత్నముపైననే భారము వైచి కాలు కదల్పకయే లేఖలమూలమున నొకటిరెండు చోట్లఁ బ్రయత్నించితిని. కాని నాప్రయత్నమునకు సరిగానే ఫలము గూడ నైనది. ఆవల దానిమాటయే యెత్తుకొనక రెండున్నరయేఁడు గడచిపోయినది. ఇట్లుండ నొకనాఁడు భగవదాజ్ఞ యయినట్లు షాడకట్టఁ బరోపకార పరాయణ ప్రముఖులును, మహోత్సాహపూరితులును, మహోదారశీలురు నగు బ్రహ్మశ్రీ భిషక్ఛిరోమణి ఆయుర్వేదరత్న తొగర్చేటి రామభద్రయ్యగారితో మాటవరుసకు ముద్రణప్రసంగమును, కృతిసమర్పణోత్సవప్రసంగమును దెచ్చితిని. అందులకు వారు స్వపరహస్తములచే సాహాయ్యముఁ జేసి చేయింతు నన్నప్రోత్సాహముతోడనే నిరతాన్నప్రదాత్రులును, మహోదారాశయలును నగు శ్రీమతి గంద్రకోట సుబ్బమ్మగారియొద్దకు 'అస్మాకం బదరీచక్రం యుష్మాకం బదరీతరుః, బాదరాయణసంబంధాత్' అన్నట్లు వారిచేఁ బ్రతిష్ఠితుఁడును, నస్మత్కృతి స్వామియు నగు శ్రీసత్యనారాయణస్వామి సంబంధమును గల్పించుకొని చందావిషయముగాఁ బోయి విషయానుకూల్యముగఁ జతుర్థాశ్వాసములోని యాజ్ఞాప్రకారము

సంశయము విసిపించి యాగమనకారణము దెలిపితిని. వారు నాకృతిరచనను గుఱించి విని యున్నవారు గానఁ దత్ప్రచురణవిషయమున నుత్సుకితాశయు లయ్యు నభ్యర్థనాభావముచే మాధ్యస్థ్యమును వహించి యున్నవారు గాన నప్పు డయ్యాచ్ఞాపద్ధతి విన్నతరువాత నిష్టదేవతాకథాసక్తిచే గ్రంథ మాద్యంతమును వినిపింపవలసినది గాఁ గోరి యప్పటి కేదో వచ్చినదానికిఁ దగిన ప్రోత్సాహవాక్యములు నుడువుచు సాంతము విన్నతరువాత మొదటి సంకల్పితార్థముకంటె నిబ్బడి ముబ్బడికి మిక్కిలిగా నూఱు రూప్యముల నిత్తునని నాయభ్యర్థనకంటె నెన్నిరెట్లో మిన్న యైన యీయౌదార్యమును వెలిబుచ్చిరి. అంత నేనును దప్పుఁ గలకొలఁది పాటికి నొండొకరినిఁ జేర్చుటకన్నఁ బోషకత్వము తమదిగనే యున్న బాగుండునేమో యని కొన్ని గుణవత్తరము లైనవిషయములం జెప్పి నొప్పించితినేమో యని పశ్చాత్తాప పడితిని. కాని యాయమగారి యుదారశీలమున కీమాట నొప్పి గల్గించినది గాక యానందసంధాయక మైనట్లే వారి గంభీరభాషణమువలనఁ దెలియ నయ్యెను. 'భగవదాజ్ఞ యట్టిదిగానే యున్నది. అట్లే కానిం'డని సమ్మతించి ముద్రింపించిరి.

## కృతిసమర్పణోత్సవము.

కొనసాగినను గొనసాగక పోయినను మానవునికిఁ గుప్పతిప్పలుగఁ గోర్కు లుప్పతిల్లుట ప్రకృతిధర్మము. కడపలో శ్రీమాగురుపాదులవారి ఆంధ్ర శ్రీమద్రామాయణమునకుఁ గృతిసమర్పణోత్సవమును జేయుట చూచిన దాదిగ భగవానుఁడు నాచేఁ గూడ నిట్టియుత్సవము జరిపించుఁ గాక యని మాత్రము మానసమున నంకురిత మయ్యెను. అప్పుడు కవి ప్రశంసా పద్యములలోఁ గడపట

ఉ. శ్రేణిగ గ్రంథముల్ గొనెదు చేఁతలు నేర్చితివమ్మ యింకనుం
    రాణఁ గవీంద్రులం గని పరంపర వాఙ్మయవృద్ధి నేసి వి

స్వాణముగా సనాతనసనాతనకీర్తి గడించి నిత్యక
ళ్యాణము పచ్చతోరణము నై చగ వర్ధిలు పత్తమండలీ!

అని సాభిప్రాయవిశేషముగా శుభాశంసఁ జేసితిని. అందలి 'నిత్యకళ్యాణము
పచ్చతోరణము నై చగ వర్ధిలు పత్తమండలీ!' యన్నదిమాత్రము భాషా
సేవక మహాశయులవలనఁ గొంతకుఁ గొంతైనఁ బొల్లు గాఁబో దనునమ్మక
మున్నది శాస్త్రీయములో నది కొంత సమన్వయించిన మేలుగదా యనిస్పష్ట
పకై యఘటన ఘటనాసమర్థుఁ డగుసర్వేశ్వరుని గుఱించి పరిపరివిధముల
మానసము చింతిలుచుండునది. 'తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం
వహామ్యహమ్' అన్నతన ప్రతిజ్ఞనుమాత్ర మాసర్వేశ్వరుఁడు నెఱవేర్చు
కొన్నవాఁడే యయ్యెను. యథా సంకల్పితముగనే గ్రంథరచనయును ముద్ర
ణమును నయినవి. ఇఁక నిశ్చితం బైనది కృతిసమర్పణోత్సవము కర్తవ్యమై
మిగిలి యున్నది. ఈవిషయమై యొకనాఁటిసమావేశములో మాయుపాధ్యా
యసంఘమునకు సూచించితిని. వారు కార్యనిర్వాహకత్వమున కంగీకరించి
యుత్సాహము గల్పించి సర్వతోముఖముగఁ దోడ్పడిరి. శ్రీశ్రీ గాడిచెర్ల
హరిసర్వోత్తమరావు ఎం. ఏ. ఎం. ఎల్. సి. గారి యధ్యక్షతక్రింద నొక
యాహ్వానసంఘ మేర్పడెను. అస్మన్మిత్రులగు కావ్యవిశారద అనుముల వేంకట
శేషకవిగారు కార్యదర్శిత్వమును స్వీకరించి కార్యనిర్వహణమునకు దీక్ష
వహించిరి. సింహపురీ (నెల్లూరు) వాస్తవ్యులును, వేంకటగిరి మహారాజా
వారికాలేజి పండితులును, నభినవతిక్కనబిరు దాభిరాములును, భాషాసేవ
కులును, గ్రంథకర్తలును నగు బ్రహ్మశ్రీ దుర్భా సుబ్రహ్మణ్యశర్మగారిని సా
సభ కధ్యక్షపదవి నలంకరింప సభ్యసంకల్పమునఁ బ్రార్థింపవలసి వచ్చి ప్రా
ర్థించినను వా రందులకుఁ బెద్దమనసుఁజేసి సమయూర నాఁడే తిక్కనజయం
తి జరుగ నున్నను దతోధికముగ భావించి దయచేసిరి. ఆహూతులైనపండితు
లలోఁ గొందఱు పండిత మహాశయులు విచ్చేసిరి. స్వస్తి శ్రీ విభవ ఫాల్గున

బ ౧౨ స్థిరవారము (6-4-29) భగవదనుగ్రహమున మహావైభవముగఁ కృతిసమర్పణమహోత్సవము జరిగెను.

శ్లో. విభవే ఫాల్గునే కృష్ణద్వాదశ్యాం స్థిరవాసరే,
శ్రీసత్యమాహాత్మ్యకృతే రాసీత్కృతిసమర్పణమ్.

నాఁ డుదయమున శ్రీసత్యనారాయణస్వామికిని, కృతికిని, అధ్యక్షుల వారికిని విందువైభవముతో గ్రామోత్సవము జరిగెను. ఆవల, కృతిసమర్పణ మయ్యెను. మధ్యాహ్నము శ్రీమతి గంద్రకోట సుబ్బమ్మగారు భక్ష్యభోజ్యములతో బ్రాహ్మణసంతర్పణము చేసిరి. సాయంతనము ౪ గంటలకు సభ సమావేశ మయి పండితోపన్యాసాదులతో రాత్రి ౯ గంటలకు జయప్రద ముగ ముగిసెను. ఇందులోఁ బోతనజీవితనాటకములోని యేకాంకమును ప్రదర్శించి సభాసదులయభినుతికిఁ బాత్రులైన చి. నంద్యాల. కృష్ణమూర్తి, చి. మాధవయ్య యనుకుఱ్ఱవాండ్రను బురోభివృద్ధికామనతో నాశీర్వదింప వలసి యున్నది.

## కృతజ్ఞత.

ఈకార్యమునకు మొదటినుండియుఁ బ్రోత్సాహకు లైన శ్రీరామభద్రయ్యగారికిని, ముద్రణ సాహాయ్యమునకే గాక కృతిసమర్పణోత్సవము నందును బ్రాహ్మణసంతర్పణాదులయెడను సర్వవిధములఁ దోడ్పడిన శ్రీమతి గంద్రకోట సుబ్బమ్మగారికిని, కృతిసమర్పణోత్సవమునకై తోడ్పడిన మా యుపాధ్యాయసంఘమువారికిని, ఆహ్వానసంఘమువారికిని, కార్యదర్శిగారికిని, అధ్యక్షపదవి నలంకరించి జయప్రదముగ నెఱవేర్చిన శ్రీదుర్భా సుబ్రహ్మణ్యశర్మగారికిని, భాషాభిమాన ముంచి విచ్చేసిన పండితులకును, సభ నలంకరించినమహాశయులకును కృతజ్ఞతాపూర్వకవందనము లర్పించుచున్నాఁడను. కార్యకరణ భాగమున నత్యంతోత్సాహపూరితులై తోడ్పడినమా హైస్కూలువిద్యార్థుల కితోభ్యుదయాకాంక్షతో నాశీఃపురస్సరముగ నభినందనములు.

చేయుచున్నాఁడను. సద్యఃప్రార్థనామాత్రముననే యామోదించి నియమిత కాలములోపలనే యచ్చు వేయించి యుపకరించిన యాంధ్రభాషాకోశోద్ధారకులగు బ్రహ్మశ్రీ వావిళ్ల. వేంకటేశ్వరశాస్త్రులవారికిని కృతజ్ఞతాభివాదము లొసరించుచున్నాఁడను.

## —౿ వింతప్రశ్నములు. ౿—

కృతిసమర్పణోత్సవ మన నేమి? ఆధునికమా? ప్రాచీనమా? ఎందులకుఁ జేయవలె? నని యాధునికకృతిపైఁ గలచిన్నిదృష్టితోడి కొన్నివింత ప్రశ్నాస్త్రములు బయలుదేఱినవఁట! 'ఆధునికమైన నేమి? ప్రాచీనమైన నేమి? తప్పుపని గాదు గదా! తదాందోళనముచేత నైనను గొంత భగవత్కార్యాసక్తియుఁ, దత్కార్యాచరణమును నగునుగదా!' యని వినోదసమాధానప్రత్యస్త్రములు పుట్టినవఁట. ఎవరిప్రశ్నోత్తరము లెట్లున్నను

మ. బ్రదుకం గల్గినయన్నినాళ్లును మనోవాక్కాయకర్మంబులన్
నిదురం బోయిన నిల్చినన్ నడచిన న్మేల్కొన్నఁ గూర్చుండినన్
మది నూహించినఁ జింత నేసినను సంభాషించినన్ విన్ననున్
దుదినిన్ నీల్గిన బిరువోక భగవంతుం గొల్తుఁగా కెప్పుడున్. పీఠ. 41

అని భావించువారికిఁ దప్పు గాదు గదా! అయినను బ్రాచీనాచారమే యని తెలిపినదాన విశేషగౌరవమే గనుక నొక్కయుదాహరణమే చెప్పెదము. శ్రీకృష్ణరాయలు గతించినతరువాత నాతనిం గూర్చి యల్లసానిపెద్దన

మనుచరిత్రం బందుకొనువేళఁ బుర మేఁగఁ
బల్లకి తనకేలఁ బట్టి యెత్తె

అని చెప్పియున్నాఁడు. కృతి యనునది కవిగర్భవాసమున జనించిన కన్యక యనియు, అక్కన్నియను గృతినాథునకు సమర్పించుకొను వేడుకయే కృతి సమర్పణోత్సవ మనియు భావించుటలోఁ దప్పులేదుగదా!

## ప్రశంసాపద్యములు.

బ్రహ్మశ్రీ గణితవిద్యావిశారద కాశావజ్ఝుల వైశ్వదేవం. వేంకట సుబ్రహ్మణ్యసిద్ధాంతిగారు (పెగళ్ళపాడు) నాఁటిసభలోఁ జదివినపద్యములలోఁ గొన్ని

మ. పదలాలిత్య మయారె! భావఘటనాపాండిత్యమా మేలు పు
ణ్యాదచారిత్రకథాప్రశంస సరె దివ్యన్మల్లికాగుచ్ఛ ని
ష్య దుదారాచ్ఛ మరందబిందులహరీరమ్యాకృతిం బోలి ధీ
ప్రదమై యొప్పెను దావకీనకృతి సుబ్రహ్మణ్యవిద్వన్మణీ!

... ... ... ... ...

క. ఆచంద్రార్కస్థాయిగ
నీచరితము వృద్ధిఁ గనుత నిత్యము కవితా
ధీచతుర! నీయశోలత
నీచతురాశాంతములకు నెగఁబ్రాఁకంగన్.

## యోగ్యతాపత్రము.

1926 ఏప్రెల్ మాసములో విజయనగరమునజరిగిన 'ఆంధ్రభారతీ తీర్థ' పరీక్షయందుఁ గావ్యకవితలో సీగ్రంథము ఫస్ట్‌క్లాస్ సర్టిఫికెట్టు సంపాదించినది. ఆపరీక్షాధికారు లొసఁగిన సర్టిఫికెట్టునకు నకలు.

# THE ANDHRA RESEARCH-UNIVERSITY, VIZIANAGRAM CITY

## CHANCELLOR'S DIPLOMA

**Faculty of** **Sri Kavimandali Vizianagram.** **Fine arts.**

Be it known and declared

**To all those whom it may concern**

greeting

This *Diploma de Honneur* is granted to *Kavyathirtha Maddulapalli Venkata Subrahmanya Sastri Garu* on the occasion of the annual session for the exhibition of his *Kavya Kavita* which has earned *First Class* distinction in the estimation of a duly constituted committee of Judges.

Wherefore is given the seal of this Corporation at Vizianagram this day, the first of the month of May of the year 1926.

**(Sd.) G. SITAPATI,**
*Dean of Faculty.*

**(Sd.) BHOGARAJU NARAYANAMURTHY,**
*Chairman of Judges-Committe.*

1. *President, of the Session.*

2. *Registrar.*

## ఉపసంహారము.

మహాశయులారా!

'కూపకూర్మ స్సభక్ష్యః కిం జానీతే? భువనచరితం
కిం సుఖం చోపభుంక్తే?'

ఆప్పట్లు గాకుండ నించుక కన్ను విప్పి చూచినచో నాదినుండియు మన పూర్వు లొనరించినభాషాసేవలో మనమును భాషాసేవ చేయుచున్నా మని యల్ప సంతోషిత్వభాజకుల మగుట హనుమంతునిముందఱ కుప్పిగంతులే యయ్యెడు నని నాయూహ. అట్లని నిస్పృహం జెంది శక్తివంచన చేసికొనక భగవంతు డిచ్చినంతలోనే భాషాదేవ్యుపాసనతోఁ గాలముఁ బుత్త మనియు, 'తుదిసిన్ సిద్ధిస పెరువోక భగవంతుం గొల్తుఁగా కెప్పుడున్' అనునాశయమున కిదియ శరణ్యం బగుటను నేదో యింతమాత్రము కైంకర్యము చేసికొనఁ గల్గినాఁడ నని సంతోషింపవలసినదే తప్ప నందని మ్రాసి పండ్లకు కళ్లులు సాఁచినదానఁ బ్రయోజనము లే దని నాభావన. ఇందలి గుణదోషములకు సహృదయులే ప్రమాణము. తెలియపఱుపఁ దగినవిషయము లున్న నెలవీయవలసినదిగా యిదివఱలోనే ప్రార్థించి యున్నాను. భవభూతి మహాకవి వచించిన సుభాషితమును బఠించి యింతటితో స్వస్తి చెప్పుచున్నాను.

శ్లో. యే నామ కేచి దిహ నః ప్రథయం త్యవజ్ఞాం
జానంతి తే కిమపి తాన్ ప్రతి నైష యత్నః,
ఉత్పత్స్యతే మమ తు కోఽపి సమానధర్మా
కాలో హ్యయం నిరవధి ర్విపులా చ పృథ్వీ.

తేజస్వి నా వధీత మస్తు.
ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

శ్రీ శ్రీ శ్రీ

ఇట్లు,
విద్వజ్జనవిధేయుఁడు,
మ. వేం. సు. శాస్త్రి.

కవితాసామ్రాజ్యము
నంద్యాల.
10-6-29

## తప్పొప్పుల పట్టిక.

| పుట | పంక్తి. | తప్పు. | ఒప్పు |
|---|---|---|---|
| 20 | 2 | సభాధ | నబాధ |
| | 17 | లేశము | భాగ్యమున |
| 21 | 4 | మాధురిమ | మాధురిని |
| | 5 | మాధురిమ | మాధురిని |
| | 6 | మనుచుక్ సంభావింతు | మనుచుక్ భావింతు |
| | 16 | రుచిం | గ్రహిం |
| 22 | 3 | నెన్నఁడేక్ | నెన్నఁడేక్ |
| 30 | 15 | కెజెంగింతు ననిన | కెఱంగింతు నని |
| 31 | 6 | గ్రసి | వ్యథి |
| 35 | 14 | గ్రసి | వ్యథి |
| 53 | 6 | ప్రశా | సుదృక్ |
| 61 | 4 | చేఁదఁగ | పెఁపఁగ |
| 91 | 4 | యాఅటం | యూఅటం |

ఇంకను గొన్ని యుండ వచ్చును. దయచేసి మూలములో దిద్దుకొని సుష్ఠుపాఠముతోనే చదువ బ్రార్థన.

## కృతిపోషక వంశావళీప్రశంస.

కవి:—

శ్రీయును వాణియున్ జనన సిద్ధముగా నభివృద్ధిఁ జెందుస
ద్ధాంగుతబుద్ధితోడుతఁ బరస్పరలీల వెసంగఁ జేసి య
త్యాయతవైభవంబుగ నితోభ్యుదయంబుగ ధర్మవృద్ధినిం
జేయుచుసుంద్రుగాపుత మశేషవిశేషవిభూతిరీతులన్. 1

కవితాకుమారి:—

మ. పురుషుల్ సాకృతికన్యఁ బ్రోతు రని నీబుద్ధిన్ విచారించె దె
వ్వరుసన్ స్త్రీలక గాక పిల్లలను బ్రోవన్ బూరుషశ్రేణికిం
పరమే? యెందులకయ్య యూహలఁపు? నానాభంగులన్ సర్వత
స్థిరభోగంబుల ధర్మవృద్ధులను మాస్త్రీజాతి వర్ధిల్లుతన్. 2

కవి:—

క. జాత్యభిమానముచే ని
ట్లత్యుక్తిగఁ జెప్పికొందు వంతియ కాసే
కృత్యాదిపోషకులు మా
జాత్యులు గా కెవరో చూచి సరిగాఁ జెపుమా? 3

క. కు:—

ఆ. వాద మేల మనకు? నీదుకృతిం బ్రోచి
నట్టివార లెవరో? యదియుఁ జెపుమ!
మనసు దీర నేనె మాసుబ్బమాంబికా
గుణము లెన్న వలయుఁ గూడ దీవు. 4

కవి:—

క. నీయింగిత మెఱిఁగితిఁ గా
నీ యొండొకమాట. యెంతయేఁ జెప్పిన నీ

వ్రాయుము చెప్పినయంశము
వ్రాయక మెటు సేయుదెమొ! పసితనము సుమీ! 5

క. కు:—

ఆ. మదికి వచ్చుచున్న మానక విధి లేక
చవిటినేల విత్తు చల్లు డేవు
పసితనంబె యైన దోసఁగేమి? నాకు ప
ర్ణ్యంబు వాగతీత మైనయపుడు. 6

ఆ. ఐన నతిశయోక్తి కవకాశ మీయను
గాని యొకటి చెప్పుదానఁ బురుష
పక్ష మీవు స్త్రీల పక్ష మేను వహింత
మిట్లు నీవు కొంత యేను కొంత. 7

క. ఇంతియ గాక మఱొక్కటి.
నుంత వచింపంగవలయు చోటుల నీ నా
యంతర్భావము దెలుపఁగ
నంతరమును నిచ్చుకొందమా! మనలోనన్. 8

కవి:—

సీ. కృష్ణరాయలశౌర్య కీర్తి సూర్యేందురా
జిత మైనరాయల సీమలోన
దాన ధర్మక్రియా దార్య శౌర్యాద్యనే
కగుణమా కర్నూలు ఖండమందు
దాతృ ధార్మిక మహోదార శూరాది భా
సుర మైననంద్యాల పురమునందు
వేద శాస్త్ర శ్రౌత విద్యా సదాచార
వంతమౌ కౌకుంట్ల వంశమందు

తే. సీమకును ఖండమునకును గ్రామమునకు
వంశమునకును దేజంబు వన్నె వాసి
కీర్తి చెలఁగఁ బుట్టెను గుణస్ఫూర్తితోడ
హరిహరధ్యానభస్త్రి మల్లయ్యశాస్త్రి. 9

క. ఆలమల్లయశాస్త్రికి చు
జ్జ్వలతరగుణరాశి బుద్ధిశాలి 'సుపుత్రా
కులదీపక' యనునుడి కొ
తొలఁ బర్వతశాస్త్రి యుద్భవించెన్ మించెన్. 10

తే. అతని కాప్పురు సుతులఁ మల్లయ్యశాస్త్రి
సుబ్బయ పెదరామస్వామి శుద్ధచరిత
అవిపలు చినరామస్వామి లక్ష్మయార్య
ఘనుఁడు వెంకటరామయ్య యనెడువారు. 11

సీ. కట్టించె నంద్యాల గ్రామంబులోనఁ గ
ల్యాణమండపము మల్లయ్యశాస్త్రి

క. కః——
దక్కించె నన్నసత్రము సల్పి చినతండ్రి
మంతు సుబ్బయపుత్రి మంగమాంబ

కవి:——
నడపించెఁ గూపవనప్రతిష్ఠాదులు
ప్రాభవంబునఁ జిన్న రామసామి
స్థాపించె నన్నసత్రము భూసురులకు నం
ద్యాలలోపల లక్ష్మయాభిధుండు

ఆ. ధార్మికత్వ మంత తమసొమ్ము గాఁగను
ధర్మ మంత తమకె దక్కఁ బోఁగఁ

బరుల కుపకరించు పని యిలువేల్పుగాఁ
బ్రతి యొకండు కులము వాసిఁ జేసె. 12

సీ. ఎంతమందికి నైన నిచ్చుభాగ్యమె గాని
కొందఱ వెడలించుకోఱఁత లేదు
ఏవేళ వచ్చిన నింపు సొంపే గాని
యింతేనియును నీసడింత లేదు
ఎంత తెత్తెంచిన మృష్టాన్నమే గాని
కసుపులు గాల్పుపెట్టుడులు లేవు
ఎవ్వార లైనను నిష్టబంధులె గాని
తక్కుటికి పక్షపాతంబు లేదు
తే. ఔర! యాయన్నసత్త్రప్రచారగరిమ
తద్ధనము చేసికొన్న సద్ధర్మవరిమ
తత్కులోద్ధారకునిసుకృతంపుమహిమ
యెల్లవారలకున్ లభియింపఁదరమ. 13

క. అనుదినము సరియె చూడం
జనును సమావేశ మిచట శ్రావణమాసం
బున హరిదాసులు, కార్తిక
మున గద్వాల్పండితులును బో రాఁ జేరన్. 14

క. ఇంపలి వైభవము మహా
నంది శ్రీశైలయాత్ర నడతెంచెడువా
రందఱు వచ్చెదు వోయెదు
సందర్భమునందుఁ జూడఁ జను నెంతేనిన్. 15

క. ధన ముండదె? ధన ముండిన
ఘను లుండరె? వేలకొలఁదిఁ గాని యిటుల్ స

ద్విసియోగ మవుట సందఱ
కు నౌనె? తొలిపుణ్య మెంత కూడనిదేనిన్. 16

క. దు:—

తే. వారలఁ జినరామస్వామి గారి 'కష్ట
పుత్ర బహుధన మ' త్తని పుట్టె నల్వు
రన్నలను ముప్పురప్పల ననుగమించి
సురుచిరగుణావలంబ మా సుబ్బమాంబ. 17

తే. గంద్రకోట సుబ్బాశాస్త్రి గారితనయుఁ
డైననాగేశ శాస్త్రితో నతనియాత్మ
జాతుఁ డాను సుబ్రహ్మణ్యశాస్త్రిఁ బొంది
యాత్మమాతాపితృలకు వియ్యంబు నడిపె. 18

క. ఉత్తమశీలుని గుణసం
పత్తిస్థిరు బుద్ధిమంతుఁ బర్వతశాస్త్రిన్
పత్తస్వీకృతిఁ జేకొనె
నుత్తమ గతి జిగమిషాసముద్యద్వాంఛన్. 19

సీ. అన్నపూర్ణాదేవి యన్నదానములోన
నెన వచ్చి సిరి లేక వెనుకఁ బడియె
శ్రీపతి సంపత్తులో సాటి వచ్చియు
లుబ్ధులదరిఁ జేరి లొంగిపోయె

కవి:—

వాణి విద్వాంసుల వద్దఁ జేర్చుటయందు
సరిపోలి ధన మీక తగ్గిపోయెఁ
గాదంబినియు నీఁగిలో దీటు వచ్చియు
నెల్లప్పు డీలేక డిల్లపోయె

క. కు:—

తే. ఇట్టు లోకైకగుణముచే పేరు వచ్చి
యొక్క పొక్కట రాలేక యోడిపోవ
పంచలను మించినట్టివిఖ్యాతిఁ గాంచె
శోభనగుణకదంబ మా సుబ్బమాంబ. 20

కవి:—

సీ. అవకాశ మీకున్న నంతతోఁ బోదు దం
చటు చేసి రాజులే యనుపుచుండ
మొగము చప్పించిన సగము లాభ మటంచు
శ్రీమంతులే యట్లు సేయుచుండ
నిరసించినయంత నేఁగిపోదు దటంచు
దాతలే యూత్రోవఁ దరలుచుండఁ
బ్రశ్రయంబు చేసినఁ బాటి పోవదు దంచు
స్త్రీ బుద్ధు లటు చెలరేఁగుచుండఁ

క. కు:—

తే. దానొ! యర్థులయవకాశ తారతమ్య
మరసి. సుప్రసన్నానన యగుచుఁ బ్రీతి
నాదరించు యథాశక్తి యట్టిగంద్ర
కోట సుబ్బాంబగారితో సాటి యెవరు? 21

సీ. అత్తగారు శివాలయంబు గట్టింపఁ దా
నమరించె సత్యదేవాలయంబు
ఆమె వేఱొకరిద్రవ్యమున సత్రముఁ బెట్టఁ
దా సొంతధనమున దాని నిల్పె
నాయమ తీర్థయాత్రాదు లొనర్పఁ దాఁ
క్షేత్రయాత్రాదుల నర్థిఁ జేసె

నంతమందికి నగునె?

క. కు:—సుబ్బాంబగారి

కొక్కరికిఁ దాదృశులకుఁ గా కర్వియందు. 24

కవి:—

క. యాచించి కోర్కికంటెను

బ్రాచుర్యము గాఁగఁ బడసి వచ్చినవారల్

ఆచేత నెముక లే దని

వాచింతురు సుబ్బమాంబపాణికలంబున్. 25

క. కృతిపోషణమును దేవ

ప్రతిష్ఠ సుతపోషణమును వనపోషణముల్

జతపడియె సుబ్బమాంబకు

జతపడుతక్ దక్కసప్త సంతానములున్. 26

క. కు:—

క. శుభమస్తు సత్కృతీనాం

ప్రభవోస్తూదారధర్మపరతంత్రాణాం,

కవి:—

విభవోస్తు సుకవివాచా

మభయాస్తు పరిస్థితి స్సమస్తజనానామ్. 27

శ్రీ శ్రీ శ్రీ





శ్రీమేధాదక్షిణామూర్తయే నమః.

# సత్యనారాయణ మాహాత్మ్యము.

## పీఠిక.



శ్రీమాణిక్యకిరీట మకౌపల నెదక్
శ్రీకౌస్తుభం బాత్మ సు
శ్యామచ్ఛాయయు శంఖచక్రగదల
బ్జంబుం గరాళిం గటిం
బై మెల్పచ్చనిదోవతుల్ గలుగు శ్రీ
మత్సత్యనారాయణ
స్వామిం గొల్తు నభీష్టసిద్ధికొఱక
శ్రాంతంబు స్వాంతంబునన్. 1

మ. స్వయమామీలితనేత్రుఁడై వటమహీజచ్ఛాయఁ గూర్చుండి చి, న్మయముద్రాంకితహస్తపద్ముఁడయి మౌనవ్యాఖ్యచే శిష్యసం, శయముల్ దీఱిచి తత్త్వసారముపదేశం బిచ్చు విజ్ఞాని మ, ద్దయితస్వామిఁ దలంతు సంతతము మేధాదక్షిణామూర్తినిన్. 2

మ. అమలస్ఫాటికరాజతప్రభగి దేహంబందు, జాపిన్లి వ
స్త్రమునన్, హస్తములన్ సుధాకలశ విద్యాజ్ఞానముద్రా
క్షసూ, త్రములుం, గక్షులన్ ఫణుల్ చెలంగు మేధా
దక్షిణామూర్తి నన్, క్షమాతం బ్రోచుత సంస్కృతాంధ్రక
వితాసామ్రాజ్యపీఠంబునన్. 3

మ. భువనంబుల్ పావనించు లేనగు ప్రమోదముం దమ్మిపూఁబోఁడి
పెం, చావరాగద్దియ నుండుతల్లి తనబత్తుం గాచు దేవేరి
మేల్, బనిసిం గూర్చెడునిపకర్త్రె యగు శ్రీ బాలాంబ
మాయమ్మ మ, త్కవితాకన్యకుఁ గమ్మఁదేనెపలుకుల్ గైసేసి
కాపాడుతన్. 4

శా. శ్రీదంబై ప్రణవస్థమై యనఘమై సిద్ధాదిసంసేవ్యమై
వేదోదీరితమై యనశ్వరమునై విజ్ఞానరూపంబు నై
ప్రాదుర్భూతజగంబునై తగుపరబ్రహ్మాత్మకజ్యోతి నే
నాదిన్ జ్ఞానపథావలోకమునకై ధ్యానింతు నశ్రాంతమున్.

మ. ఒకహస్తంబున వీణఁ బట్టుకొని వేఱొక్కంటఁ దాళంబు
వే, ఒకటన్ హారముఁ దాల్చి వీణ నొకటన్ సోత్సా
హయై గీటుచున్, సుకరస్వానము వించు స్మేరముఖయై
శోభిల్లుగీర్వాణి గాం, చి కృపాలోకమునన్ నటించుతను
మజ్జిహ్వాగ్రరంగమ్మునన్. 6

చ. అమితపదార్థసంఘటన నాత్మకు దీటుగ వాఙ్మయప్రపం
చమును సృజించె నంచుఁ బెలుచం జలపట్టక పెక్కుసృష్టిచి
త్రములకు మెచ్చి నిచ్చలు కరంబు తిరంబుగ నుండ దీవనల్

సీ. నన్నయార్యునిపావననళినంబులు భజించి
తిక్కనయజ్వకు మ్రొక్కు లొసఁగి
యెఱ్ఱప్రెగ్గడకీర్తి యెంచి భాస్కరుఁ బాడి
పోతనమంత్రికి జోత లిచ్చి
శ్రీనాథుఁ గొనియాడి సేవించి కేతన
సూరనార్యులకు సంస్తుతులు సేసి
పినవీరభద్రు భావించి సోమన్నల
గణియించి కృష్ణరాడ్ఘనత మెచ్చి
తే. పెద్దన స్తుతించి తిమ్మనపేరు నెన్ని
రామకృష్ణునిఁ బొగడి ధూర్జటులఁ దలఁచి
భట్టుమూర్తిని స్మరియించి పాపరాజు
గౌరవించి యప్పకవిని గారవించి. 13

శా. ఏకాలంబున సంస్కృతాంధ్రకవితావృత్తుల్ ప్రవర్తిల్లెనో
యాకాలంబుననుండి యింతవఱ కవ్యాజప్రభావాత్ములౌ
తక్కంగల్గిన సంస్కృతాంధ్రకవులం దర్కించి భావించెదన్
జక్కన్ లెక్కకు వచ్చుసత్కవనవాచాశక్తి సంప్రాప్తికై.

సీ. జ్యోతిషస్కంధత్రయాతినిష్ణాతుండు
సూర్యసిద్ధాంతాదిశోధకుండు
శ్రీమహావిద్యావిశేషవిజ్ఞానుండు
వ్యాకృతి సాహిత్య పండితుండు
ఆపాదుకాంతదీక్షాపరుం డుత్తమ
సంస్కృతాంధ్రకవిత్వసాగరుండు.

[illegible] బ్రహ్మాండపురాణరామాయణా
ద్యర్థుల ప్రబంధనిర్మితియశుండు
తే. సత్య ధర్మ దయా శౌచ శాంతి దాంతి
భూషణుండు కవిపండితపూజ్యుఁ డైన
ఘనుఁడు జనమంచి శేషాద్రిశర్మగురుని
చరణకమలంబులకు నమస్కార మిడుదు. 15

వ. తెలియక కొంతయుం దెలిసి తేటలు లేకయుఁ గొంత
యార్ష్యయుఁ గలుగుటఁ గొంత మచ్చరము గాంచుటఁ
గొంత కవిత్వవాసన దెలియక కొంత శబ్దముల లేనివి
తప్పులు చెప్పుచుండువారలకు నాత్మలోపముఁ దొలంగి
సహింపఁగ దోసి లొగ్గెద. 16

వ. అని యిష్టదేవతా ప్రార్థనాపురస్కారంబును సుకవిసం
స్మరణంబును గురునమస్కారణంబును కుకవిమార్గసంస్కార
ణంబునుం జేసి రామకృష్ణగురూపలబ్ధంబును మదీయపూర్వ
పుణ్యపరిపాకఫలాయమానంబును నైనయత్కించిజ్జ్ఞానంబున
నైహికాముష్మికములం దలంచుకొని యాత్మగతంబున. 17

సీ. వ్యాస వాల్మీకి శ్రీశుకాంజనే యార్జున
ప్రహ్లాదు లాదియౌ భక్తు లెల్ల
నల హరిశ్చంద్ర మాంధాతృ రాఘవ పాండు
తనయ భోజాదిభూధవులు నెల్లఁ

గాళిదాసాదిగాఁ గల్గుసంస్కృతకవుల్
నన్నయాదులు మహాంధ్రకవు లెల్ల
దేవసరః ప్రతిష్ఠావిధానాదిస
త్కార్యధర్మాత్ము లగువారు లెల్లఁ

తే. దమతమసమర్థతలచేతఁ దల్లిఋణము
దీర్చికొని దివ్యకీర్తిని గూర్చి చనఁగ
వారిభారతమాతగర్భంబునందు
పుట్టు వందితి నేఁ డొక్కపుత్త్రుఁడుగను.

వ. మఱియు.

సీ. ఆంధ్రభాషావల్లి యల్లిబిల్లిగ నల్లి
కొనియె నఱకీర్తి చేకొనియె నేది
యాంధ్రరాజులచేత నటుచేత బలిచేత
గొనియె నఱకీర్తి చేకొనియె నేది
తిక్కనాదుల మీఁజుఁ దీపారఁ గడుపారఁ
గనియె నఱకీర్తి చేకొనియె నేది
కవితావధూటి చక్కనిసూటి యగుధాటి
మనియె నఱకీర్తి చేకొనియె నేది

తే. అష్టిశస్త్రశస్త్రగుణాకరంబు
స్వచ్ఛతరకీర్తిరాజిత మాంధ్రదేశ
మండనం బగునెల్లూరుమండలంబు
జనన మందినదివ్యమౌ జన్మభూమి.

వ. మఱియును. 21

సీ. పోతనాదిమహాకవులఁ గన్న కౌండిన్య
మునిగోత్రమున వెల్గు మొదటితండ్రి
ఆసాంతవేదవేదాంతవిద్యాప్రౌఢ
తరపాండితీభాసి తాతతండ్రి
స్కంధత్రయజ్యోతిషప్రౌఢపాండితీ
తతకీర్తివిభ్రాజి తండ్రితండ్రి
జ్యోతిషామ్నాయసంశోధనోపాత్తవి
జ్ఞానసంపన్నుఁడు కన్నతండ్రి
తే. పెద్దవ్యాకరణజ్ఞుండు పిన్నతండ్రి
యాంధ్రకవితావతారవిఖ్యాతుఁ డన్న
వరుసగా నిట్టిపండితవంశమందు
జనన మందితిఁ గర్మానుసారముగను. 22

వ. కావున. 23

శా. ధాత్రిన్ భారతమాతపుణ్యసకలవిద్వద్వ్రాజరాజద్యశః
పాత్రం బౌనిజజన్మభూమికిని మద్వంశీయు లౌవారిక్
'బుత్రశ్శత్రురపండితో'యనెడు పెద్దుఃఖంబు చేకూర్చి నే
శత్రుప్రాయుఁడనైతిఁగా యనిమహాసంతాపముం జెందుచున్

వ. పూర్వవృత్తంబుం జింతించుకొనుచుండ. 25

మ. అభయం బిచ్చెదులాగు మత్సుకృతభాగ్యాఘోషసంరా
వదుం, దుభిరై దుందుభి యేఁగుదెంచుదు జనస్తుత్యంబు

గాఁగఁ జను, ప్రభృతిఁ రామజయంతినాఁటితటి సీతా
రామకల్యాణకా, ర్యభరంబుఁ నెఱవేర్చునంత నొ
యారోహ్వానంబు వచ్చెఁ దగన్. 26

క. ఏక్కడఁ గడపపురంబు? మ
రెక్కడ మాయూరు? దైవకృత మిది యగుఁ గా;
కెక్కార్యమందు భావుకుఁ
డొక్కఁడు సంధాత యరయ నొండొరులకుఁ దాన్. 27

వ. కావున. 28

మ. పరవేదాధ్యయనంబు తీఱునెడ దైవజ్ఞుండు తా నొటచే
పరసాహిత్యకవిత్వముల్ గలుగునట్టి భావంబుతో నేమొ!
ప, ద్దురులం జేర్చుచు వచ్చినందులకుఁ జేతుల్ మోడ్చెదన్
భక్తిత, త్వరతన్ బావకుఁ దెల్కపల్లికులసుబ్రహ్మణ్య
సిద్ధాంతికిన్. 29

క. ఎందఱు మేలావ్రాయసకాం
డ్రుందురు! రామాయణంబు నొక్కమొగిన్ వ్రా
యం దగుభాగ్యం బది నా
కుం దక్కుట పుణ్యఫలము గూడుట గాదే! 30

ఆ. అడవినెల్లికాయ నంబుధిలవణంబుఁ
గూర్చునట్లు గురుని జేర్చినట్టి
యఘటనఘటనాసమర్థ మహాదైవంబు
సృష్టిచిత్ర మరయ నేరితరము! 31

వ. అని కొండొక్క శుభోదర్కంబుం దలంచుకొని భాగ్యో
దయంబునకు సంతసించి సద్గురుప్రాప్తిచేఁ గృతార్థమ్మన్యుండ
నై తత్సన్నిధిం జేరి కరణీయంబు నిర్వర్తించుచుఁ దత్స
ద్గురుకరుణాకటాక్షభిక్షితమహామంత్ర తీర్థ ప్రసాద విద్యా
లాభంబులు వడసి కొంతగీర్వాణకవిత కాంధ్రకవిత న్వా
దోడు సేసి. 32

తే. ఏమహాత్ములకరుణచే నిట్టికవిత
కల్గెనో తత్కృతజ్ఞత కారణముగ
నఖిలదేవస్తుతి 'కవితాప్రాప్తి' యనెడు
గ్రంథ మొక్కఁడు వ్రాసి యర్పణము సేసి. 33

. శ స్త మగుదక్షిణామూ
ర్తిస్తోత్రము తెనుఁగు సేసి దివ్యముగఁ గవీ
శస్తుత్య మ్మగుకవితా
వస్తుసామగ్రి నిష్టభగవత్కరుణన్. 34

గా. నానాలంకృతి జాతివృత్తవిలసన్నక్షత్రచక్రాదిశో
భామాన ప్రియమాణసద్గణయతిప్రాసాంకితశ్రీరమే
శానాంశాంచిత సంస్కృతాంధ్రకవితాసామ్రాజ్యసింహాస
నా, సీనుండై కవిరాడ్విధేయుఁ డయితిన్ జేగీయమానం
బుగన్. 45

. తదనంతరంబు. 36

మ. కలకత్తాపురి కేఁగి యందలిపరీక్షం దీర్చి శ్రీకాశికం, గల
యం జూచి యయోధ్య కేఁగి యమునాగంగానదీసంగమ
స్థలముం గాంచి చరించి పిమ్మట గయాధాత్రిన్ జగన్నా
థముం, కిలకింపం జని గౌతమిన్ మునిఁగి తత్తత్కృష్ణానదీ
స్నాయినై. 37

చ. నిలయము సేరి యందు జననీజనకాంఘ్రులసేవ సేసి కా
వలసినకార్యముల్ జరపి వైశమ సద్గురుపాదపద్మము
ల్గొలువఁగఁబోయి చెన్నపురిలో నుచితస్థలిఁబండితుండఁగా
సెల వొసఁగంగ నచ్చోటునఁ జేరి సగౌరవవృత్తి నుండు
చోన్. 38

వ. ఒక్కొక్కనాఁ డంతస్సుఖజ్ఞానంబున నాత్మగతంబున. 39

క. విషపరిణామం బగుదు
ర్విషయానందంబు మిథ్య శ్రీమద్భగవ
ద్విషయానందం బొక్కఁడ
విషమించనిసుఖ మటంచు వెదకి తలంచుచున్. 40

మ. బ్రదుకుం గల్గిన యన్నినాళ్లను మనోవాక్కాయకర్మం
బులన్, నిదురంబోయిన నిల్చినన్ నడచిన న్నేల్కొన్నఁ
గూర్చుండినన్, మది నూహించినఁ జింత సేసినను సంభా
షించినన్ విన్ననుం, దుదినిన్ నీల్గిన బీరువోక భగవంతుం
గొల్తుఁగా కెప్పుడున్. 41

వ. అని తలంచుకొని చిత్తంబు దైవాయత్తంబు చేసికొనుచు
నప్పటప్పటి. 42

ఉ. విశ్వజనీనమై తగుకవిత్వపటుత్వము సాధనంబుగా
నశ్వరమైనయీతనువునన్ బ్రదుకుండిననాళ్లఁబిమ్మటన్
శాశ్వతుఁడౌ పరాత్పరుని సన్నిధి గల్గు నటన్న యూహ దా
శశ్వదుదంచదుద్గతవిచారపరంపరఁ బెంపఁ జేసినన్. 43

వ. మన్మనోరథసిద్ధి కిదియ తరణోపాయంబని నిశ్చయించుకొని
పఠియు. 44

శా. నామూఁడేఁడుల ప్రాయమైన కృతికన్యం బట్టి తా దీర్ఘసూ
సౌమంగల్యము గూర్చి పెంచుఘనుఁడౌ జామాత లేకుండు
టన్, 'జామాతా దశమో గ్రహః' యనుచుఁ దోఁచన్
మూఢులం ద్రోసి ని, స్సీమజ్ఞానదయుం దలంచి వరుఁగా
శ్రీసత్యనారాయణున్. 45

వ. మత్ప్రార్థనాంగీకారసమాధానంబుగా మనోవీథిం బ్రతిఫలిం
చినంత. 46

సీ. తల్లిదండ్రులు లేక తప్పిపుట్టినఁగాని
ప్రాఁబల్కులకు నందరానివాఁడు
తొలిజగంబులకన్నఁ దొలుదొల్తఁ బుట్టిన
ముప్పదియేండ్లతో నొప్పువాఁడు
జగమంత సంసారముగఁ బెట్టికొన్నను
దగులాటములు లేక మిగులువాఁడు
రూపురేకలు గల్గి చూపట్టకున్నను
నందమై యన్నిట నలరువాఁడు

తే. వ్యయము నొందని పెద్ద పా।పయసువాఁడు
దిక్కులేనట్టివారికిఁ। దిక్కువాఁడు
ఇట్టిసిరితేఁడు నాకృతి। కీడుజోడు
నైనపతి యయ్యెఁ దొంటిపు।ణ్యమున నేఁడు. 47

వ. అని నాపూర్వపుణ్యంబు పండి సాక్షాచ్ఛ్రీనాథుండ కృతి నాథుం డగుటకుం గొండొక్క ముఱిసి కృతిపతి నభివర్ణిం చెద. 48

సీ. జగము మోహించెడి। నిగనిగల్ గలవాఁడు
సిరి నెదం దాల్చిన। సిరిగలాఁడు
అది యిది యని గాక। యన్ని యెఱుఁగువాఁడు
తొలిపల్కు లెన్ని న।కొలమువాఁడు
పరిలేని యమృతప్ర।సాద మిచ్చెడువాఁడు
నెల్లవారలకును। మెల్లవాఁడు
ఈరేడు జగముల। నేలుమేలగు తేఁడు
తన్నుఁగా నందఱుఁ। దలఁచువాఁడు

తే. మంచివారలపై మన।సుంచువాఁడు
దుడుకుసారదోషులను బా।ఱఁద్రోలువాఁడు
ధర్మమార్గము నెలకొల్పు।తలఁపువాఁడు
పెక్కుపుట్టువు లందిన।పెద్దవాఁడు. 49

వ. మఱియు. 50

సీ. అణువులోఁ బరమాణు। వంతవాఁ డయ్యు బ్ర
హ్మాండంబు నంతయు। నిండువాఁడు

క్షేత్రజ్ఞుండౌచు వెలసి యుండియు నం
తర్బహిర్వ్యాపకత్వంబువాఁడు
జ్యోతిస్స్వరూపుఁ డయ్యును గాఢమైనయ
జ్ఞానాంధమునఁ గానరానివాఁడు
సచరాచర ప్రపంచవ్యతీతుం డయ్యు
బొజ్జలో జగ మెుంచుకొబుచ్చువాఁడు
తే. అన్నిచిత్రవిచిత్రములైనవాఁడు
నున్నసర్వముఁ దనరూపమన్నవాఁడు
కల్లజగముల నాడించుగారడీఁడు
నేమి యెఱుఁగనిచందానఁ నెసఁగువాఁడు. 51

ఉ. చల్లనివాఁడు వాలినభుజంబులవాఁడు కృపారసంబు చి
ప్పిల్లెడువాఁడు మచ్చగలపేరుటురంబు గలాఁడు మెత్తనౌ
నుల్లమువాఁడు తమ్మికనులొప్పెడివాఁ డిగురొత్తునవ్వు శో
భిల్లెడువాఁడు మేల్తులసిపేరులవాఁ డెనలేనివాఁ డెటన్.

వ. మఱియును. 53

సీ. ఒక్కఁడై రెంటికిఁ జిక్కకుండెడువాఁడు
త్రిపదస్థుఁడై నాల్గుతీరువాఁడు
ఐదవయంకెలోఁ నమరియుండెడువాఁడు
షడ్భావములు లేక జరగువాఁడు
సప్తమసంఖ్యలోఁ గుప్తమయ్యెడివాఁడు
నెనిమిది యెడఁబాసి యెనయువాఁడు

ప్రస్మిత శాంతుఁడై ✽ తోఁపించువాఁడును
బడిలోనఁ బలుమాఱు ✽ పడినవాఁడు
తే. పదునాకొండున కీర్త్యుఁడై ✽ పరగువాఁడు
ద్వాదశస్వరూపములతో ✽ వఱలువాఁడు
నంత కంత సంఖ్యాతీతుఁ ✽ డైనవాఁడు
తుష్టితుదను సంపూర్ణుఁడై ✽ తోఁచువాఁడు. 54
వ. మఱియును. 55
సీ. మొసలివాతను జిక్కి ✽ మొఱయిడ్డగజరాజు
బాధ వాపినభక్త ✽ వత్సలుండు
మానభంగమువేళ ✽ దీనయై వేఁడుద్రౌ
పదిని గాచినదీన ✽ బాంధవుండు
మితిమీఱి నడచిన ✽ మేటిరక్కసులద
ర్పంబు మాపినదివ్య ✽ పౌరుషుండు
పాషాణవృష్టి పి ✽ పన్నగోవులకీడు
నణఁచినయాపదు ✽ ద్ధారకుండు
తే. జ్ఞానమోక్షంబు లొసఁగెడి ✽ దానశౌండుఁ
డాశ్రితాంతర్ముఖుల కాంత ✽ రంగికుండు
వంచకులను వంచించును ✽ పాయశాలి
బ్రహ్మవేత్తలకు విధేయ ✽ వర్తనుండు. 56
వ. మఱియును. 57
సీ. ఏమహాత్మునిమహిమ ✽ మేర్పఱింపఁగ నోడి
శేషుఁడంతటివాఁడు ✽ సెజ్జ యయ్యె

నేపరేశుయశః ప్ర ॥ తాపంబులకు నోడి
యబ్జసూర్యులదోయి ॥ యతు లయ్యె
నేమహామహాశక్తి ॥ యెఱుఁగఁజాలక యోడి
యుడ్డమోములవేల్పు ॥ బిడ్డ యయ్యె
నేపరాత్పరులీల ॥ లెంచఁజాలక యోడి
కడుపుబండిని జగాల్ ॥ మిడుకనయ్యె
తే. నేమహాశయునోరిమి ॥ నెన్నఁజాల
కోడి పంటలపుప్పుఁబోఁడి ॥ యువిదయయ్యె
నట్టిమహనీయుఁ డిట్టివాఁ ॥ డనఁగ వశమె?
యరయ వాచామగోచరుఁ ॥ డనుట గాక. 58

క. కావున వాఙ్మనసములకు
భావింపఁగరాని యిట్టి ॥ పరమాత్ముని నిం
కేవిధమున భావింపం
గా వీలగుమార్గ మేమి ॥ గానంబడమిన్. 59

తే. అంతవాచామగోచరుఁ ॥ డైనయామ
హాత్ముఁ డెక్కడ? నాయట్టి ॥ యల్పుఁ డేడ?
హస్తిమశకాంతరం బగు ॥ నైన నాదు
కృతికిఁ బతి యాటఁ దొలిపుణ్య ॥ మెంత గలదొ! 60

ఉ. ఇన్నిటి కంతవానిఁ దన ॥ కీశుని గా వరియించి వంగడం
బు న్నెతి వంశ్యులందు దశ ॥ పూర్వదశావరులైనవారి నా
పన్నగశాయివియ్యమున ॥ బ్రహ్మపదం బొనగూర్చునట్టి దై
కన్నెలమిన్న యైనకృతి ॥ కన్నియవంగడ మింకఁ దెల్పెదన్.

సీ. మారేడుపాదలసం । భవ మంది పాఱువమా
ర్కండేయనది పుట్టు । గన్న చోటు
బ్రహ్మవిష్ణుమహేశ్వ । రస్వరూపంబుతో
వీరాంజనేయుండు । వెలయునెలవు
మూలపదక్రమ । ములు జటాఘనలక్ష
ణములు పోరాడిన । సమరభూమి
వ్యాకృతి మీమాంస । యర్థశాస్త్రముఁ బదా
ర్థములఁ దీర్చిచ్చిన । రచ్చపట్టు
తే. పాదలుజ్యోతిషమునకును । బుట్టినిల్లు
పాండితీమాత్రశుల్కసం । పాదితాగ్ర
హారబిరుదంబు పుడమిలో । నన్నివిధుల
రహిఁ జెలంగును బట్టాభి । రామపురము. 62

వ. అయ్యగ్రహారంబున. 63

తే. బ్రహ్మతేజోంశవైదిక । బ్రహ్మవంశ
మత్రభగవదాపస్తంబ । సూత్రకం బ
నంతసత్కలాపజుషంబు । యాజుషంబు
దివ్యజనములు కొనియాడు । తెలుఁగునాడు. 64

తే. మూలపూరుషుఁ డద్వైత । మూర్తి యగుట
నేమొ! తనమత మద్వైత । మే యనంగ
నేమొ! యద్వైతుఁడై జని । యించె వంశ
మూలపురుషుఁడు తా గురు । మూర్తిభట్టు. 65

తే. తొంటి బ్రహ్మాంబు వేదచతుష్టయంబు
కరణి నయ్యాద్యుఁడును బెదనరసభట్టు
చిన్ననరసభట్టు పెదదీక్షితులు మఱియు
వరుస నారాయణుఁ డనునల్వురిని గనియె. 66

మ. వరుసన్ రెండవశాఖ చిన్ననరసంభట్టారకుం డాద్యుఁడౌ
గురునాథుండు ప్రపంచసృష్టికయి త్రైగుణ్యం బటుల్ బుద్ధి
మ,ద్వరులన్ బుత్త్రుల ముప్వురిం గనియెఁ బాపంభట్టు,
లక్ష్మీమనో, హరునిన్ సాంబయసూరి, ధీరు నయవారప్పాభి
ధాశోభితున్. 67

శా. ఆలక్ష్మీపతి సాంబసూరియును సత్ప్రాకారుఁ డై తద్గుణో
ద్వేలస్మార్తులు ముప్వురౌటవలనం బెంపారఁగాఁగాంచెఁదా
శ్రీలక్ష్మీనరసావధాని శ్రుతిమూర్తిన్ మంత్రశాస్త్రజ్ఞు న
ప్పాలిన్ వేంకటసుబ్బయాభిధుని సుబ్రహ్మణ్య ధీశాలినిన్.

వ. అం దగ్రజుండు బ్రహ్మశ్రీయుతుం డై. 69

ఆ. వేద మంతఁ జదివి వేదాంతవేత్త యై
మంత్రశాస్త్రమందు మహిమ వడసి
ధర్మశాస్త్రవేత్తృతాగరిష్ఠుం డయి
సూరిజనులలోన స్తుతికి నెక్కె. 70

ఉ. అంతటికిం జరాచరమయం బగులోకమొకండ బ్రహ్మ య
త్యంతము సృష్టి సేసినటు లానిగమాంతవిదుండు పార్వతీ
కాంతయెడం గుమారసముఁ గాంచెఁ గుమారకునిన్ నృసిం

హాసి, స్థాంతిని శాంతిశక్తిధరు నాశ్రితపార్థివనీలకంఠునిన్.

వ. అట్లుద్భవించిన మత్పితామహుండును. 72

సీ. సూరిసంఘము మెచ్చ జ్యోతిషంబును నేర్చె
నైజపాండితి సాధనంబు గాఁగ
పార్థివలింగసపర్య గావించె యా
వజ్జీవ మేండ్లు డెబ్బదియుఁ గాఁగ
సూర్యమంత్రోపాస్తిధుర్యుఁడై సుఖియించెఁ
బటుతరభక్తి మిక్కుటము గాఁగ
సరససద్గోష్ఠిప్రచారంబు నడిపించె
ధర్మశాస్త్రజ్ఞత తఱచు గాఁగ

తే. శమము దమము నహింస సత్యము నిగిడ్చె
బ్రహ్మకర్మంబు కడు విస్తరంబు గాఁగ
మంగళాస్పదభావాఢ్య మంగమాంబఁ
బెండ్లియాడెను వంశాభివృద్ధి గాఁగ. 73

తే. ఒక్కసంగతికిం బోకయున్నఁ గాని
తనను గురువు గా భావించుకొనని వాఁడు
నున్నకొలఁదిగఁ బూజింపకున్న వాఁడుఁ
గానఁబడఁ డదెంతటి జాతక ప్రతిభయో! 74

వ. అమ్మహనీయునకు. 75

తే. జగము సృష్టి స్థితి లయాశ్రయ మటన్న
యవ్విధము దెల్పఁ బుట్టిరి ముప్వురు నర

సింహాసూరి, వేంకటనరసింహానామ
ధేయుఁడును, సుబ్బరామశాస్త్రియును నందు. 76

వ. అగ్రజుండైన మజ్జనకుండు. 77

మ. అమలజ్యోతిషశాస్త్రవేత్తయును శిష్టాచారసంపన్నుఁడు
న్విమలజ్ఞాననిధానమానసుఁడు దుర్నీతిక్రియాదూరుఁ డి
ద్ధమహామంత్రనిరస్తరోగుఁ డురుశాంతస్వాంతుఁడున్ ధర్మ
మా, ర్గము శోధించెడిధర్మమూర్తి భగవత్కైంకర్య
దత్తాత్ముఁడున్. 78

ఉ. మానవతీవతంసము క్షమాపృథివీసమ సర్వసద్గుణ
శ్రీనిధి సేవితాంబ యగుశ్రీమతి వేంకటసుబ్బమాంబ తా
జానగుగుండ్లపూడికులసాగరకన్యక యాకతంబునన్
శ్రీనరసింహుసన్నిధికిఁ జేరెనుదొంటిక్రమంబుచాడ్పునన్.

వ. గీర్వాణీ విశ్వకర్తలం బోలునజ్జాయాపతులు సృష్టి క్రమం
బున. 80

మణిమాల.—

గణ్యం బగునీసర్గం బైదగుభూత
శ్రేణ్యాంచిత మై తోఁచెన్ వేంకటసుబ్ర
హ్మణ్యున్, గురునాథుం, బై రాఘవు, రామున్,
గణ్యంబుగఁ దాముం గంటన్ నరసింహున్. 81

ఆ. అందు నగ్రజాతుఁ డాశ్రితభగవంతుఁ
డట్టివిద్వదన్వయమునఁ బుట్టి
మడుఁగుపట్టు చెలమవడువున భగవంతు
కరుణఁ గన్న మధురకవితవాఁడు. 82

మ. హృదిలో దైవికభక్తిఁ, జింత భగవద్వృత్తాంతముఁ,బుద్ధి భూ, తదయన్, వృత్తి నబాధకత్వమును, నంతశ్శత్రునాశంబు భావదిశన్, జ్ఞాపుల వాక్కులం దపరుషత్వంబున్ గటాక్షింపఁ బెద్దదనున్ దైవము వేఁడుదీనమతి సర్వావస్థలం దెప్పుడున్. 83

వ. ఇనయిబ్భగవద్విధేయుండు కవితాజిజ్ఞాసువై. 84

తే. విద్వదుద్దీయమానకవిత్వసరణి
జ్ఞానసంపదానందసంధానకరణి
పావనకళావిలాససంజీవకరణి
భావలసదలంకారసౌవర్ణకరణి. 85

మ. మన సర్థించినదారిఁ బట్టఁగ నియామవ్రాతసంబాధ మాటను బ్రత్యక్షరగండ మాకవితజాడల్ కత్తిపై సాము;సాగిన నానందమహాపయోధిలహరీకేళీయశః ప్రాప్తి సాగనిచోఁ దీఱనిదుర్మనోవ్యథ లపఖ్యాతిస్థితుల్ సిద్ధమౌ.

మ. కవితాకన్య మనింటియాఁడుపడుచా? కాకున్న నిల్లాల? లేక వశంబందున నుండువారవధువా? కాదిట్టులం బూర్వసం, భవమందుం గలపుణ్యలేశమున సంప్రాప్తించునేగాని మానవుఁ డెన్నే విధులం దపించినను జెంతం జేరదొక్కింతయున్. 87

వ. అని కొంత జిజ్ఞాసించి మఱియు. 88

శా. ఎన్నన్ భోజనసౌఖ్య ముండి హృదయం బెంతో సుఖం బుండి పేర్కొన్నన్ గాలము మంచి దుండి యెదుటన్

శ్రోతల్ మహావిజ్ఞులై, యున్నం జెప్పినదే కవిత్వ మని తా ॥
మూహింతు రే గాని లే, కన్న ప్డెల్లను జెప్పువానిఁ గవన ॥
మ్మం చందు రే! సత్కవుల్. 89

మ. కర మాపాతమనోజ్ఞమాధురిమ ద్రాక్షాపాకమం డ్రించు
కన్, బరిశీలించినఁ దోఁచుమాధురిమ రంభాపాకమం డ్రెప్పు
దు, ర్భరమాధుర్యము నారికేళమనుచున్ ॥ సంభావింతు
రీమూఁటికిన్, విరసం బై కనుపించుతద్రచన కుంభీపాకమే
యయ్యెడిన్. 90

ఉ. ప్రాసముకోసమై వెదక ॥ రాదు యతిప్రతిపాదనార్థ మై
గాసిని జెందరాదు గణ ॥ కల్పనకోసము జల్లిపల్కుల
భ్యాసము సేయరాదు తగ ॥ నంతటిసొంపుగ నొక్కపద్య మేన్
వ్రాసినఁ జాలదే! కవిశి ॥ రంబుల నుయ్యెల లూఁప నేపునన్.

మ. పదలాలిత్యము నర్థగౌరవము భా ॥ వప్రాఢియున్ రీతియో
గ్యదశల్ సద్గుణసౌష్ఠవంబును నలం ॥ కారంపు సౌందర్యము
న్గదురా మేల్నడజాడ లేనికవిత ॥ న్నొ య్యెంతు రే! యీసడిం
చెద రే గాని రుచింతు రే! సరసు లీ ॥ క్షింపఁగఁ గన్యంబ లెన్.

సీ. పామరుఁ డుల్లసిల్లవలె ॥ బాలుఁడు నాటలఁ దేలఁగావలెన్
గోమలి మోహ మొందవలెఁ ॥ గోవిదుఁడుం దల యూఁపఁ
గావలెన్, స్వామియుఁ బ్రీతిఁ జెందవలెఁ ॥ జక్కనిశైలిని
బద్య మల్లుచో, సేమిటికో మఱెవ్వరికి ॥ నిం పొనగూర్పని
పద్యజాలముల్! 93

ఉ. ఒక్కొకతావునుండి యొకఱటొక్కటి గూరిచి పంటకంబు
సుఁ, జక్కనిశుద్ధిఁ జేయఁగ మఱనంబున కింపగుమాడ్కి
నెన్నఁడేఁ, జక్కనియక్కరంబులు పొఱసంగి యొసంగు
ప్రసంగసంగతుల్, మక్కువఁ గూర్చుఁగాని యథఱమస్థితిఁ
గాంచిన రుచ్య ముండునే! 94

ఉ. ఒక్కెడ శబ్దచిత్రము మఱఒక్కెడ నర్థవిచిత్రరీతి వేఱొ
క్కెడ సంస్కృతంబు మఱియొక్కెడ నాంధ్రపదప్రయోగ
మిం, కొక్కెడ శబ్దభేదము మఱొక్కెడ గొప్పసమాస
మొప్ప నిం, పెక్కఁగఁ గూర్చఁగావలయు ఱ నివ్విధి నయ్యు
యిచోట్ల నొచితిన్. 95

క. అని కవనరచననిర్బం
ధనపద్ధతి శుద్ధిపఱచి ఱ తఱచుగ నద్దా
నిని బొసఁగించుచు వాఙ్మయ
మునఁ గక్కుఱితిం బడక యఱమోఘుపుథారన్. 96

తే. అంతకఠినప్రబంధంబుఱలంత శైలి
గాక మిగులఁ జప్పనిశైలిఱగతియుఁ గాక
పండొలిచి చేతఁ బెట్టినఱపగిది గాఁగఁ
బుణ్యకథ కనువగుశైలి ఱ పొందుపఱచి. 97

సీ. ఆపాతమాధుర్య ఱ మైనద్రాక్షాపాక
మసివోక యంతటఁ ఱ బొసఁగుచుండ
శ్రవణపేయం బైన ఱ శబ్దజాటిల్యంబు
నొక్కొక్కచోట సొం ఱ పెక్కుచుండ

భావరంజకము లై ౯ భాసిల్లుసామెత
లందందుఁ బొందిక ౯ నొందుచుండ
గీర్వాణ మాంధ్రమ్ము ౯ క్షీరనీరన్యాయ
ముగ నంతటను బస ౯ మిగులుచుండ
తే. బాలగోపాలహృదయముల్ ౯ కేళిఁ దేర్చు
మృదుమధురధార యెడతెగ ౯ కెసఁగుచుండ
దయ దలిర్పంగ నాయిష్టదైవతములు
తగినచేదోడు వాదోడు ౯ నగుచునుండ. 98

—ష ష్ఠ్య ం త ము లు.—

క. శ్రీదున కమేయనిత్యా
హ్లాదునకును లౌకికాభిలాషజగన్మ
ర్యాదునకు నిగమసన్నుత
పాదునకు నిరస్తఘోరభవఖేదునకుఁ. 99

క. పరునకు నాశ్రితరక్షా
పరునకు దివ్యనయనితదివాకరరజనీ
కరునకు శాశ్వతసంప
త్కరునకుఁ గరుణాళుసత్యదైవవరునకున్. 100

క. ఘనునకు నాపన్నజనా
వనునకు భాస్వద్విలాసవైకుంఠనికే
తనునకు నాశ్రితబృందా
వనునకు దివ్యాదిశేషఫణిశయనునకున్. 101

క. శాంతునకు సత్వసద్గుణ
వంతునకు నశేషవేదవాదితనిజవృ
త్తాంతున కనాద్యమధ్యా
నంతునకు రమాసతీమనఃకాంతునకున్. 102

క. నిత్యునకు వినాశితఖల
దైత్యునకు విరించిముఖ్యదైవతగణసం
స్తుత్యున కద్భుతలీలా
నృత్యునకు నమేయకృత్యునకు సత్యునకున్. 103

క. విష్ణునకు ధర్మరక్షణ
భూష్ణునకు సమస్తయోగిపుంగవహృద్భ్రా
జిష్ణునకుఁ బాపనిహనన
ధృష్ణునకు సహిష్ణునకును శ్రీకృష్ణునకున్. 104

వ. అంకితంబుగ సంకల్పించి నానిబంధింపం బూనిన పుణ్య
ప్రబంధంబునకుం గథావిధానం బెట్టు లనిన. 105



శ్రీః

# సత్యనారాయణమాహాత్మ్యము.

## ప్ర థ మా శ్వా స ము.



సీ. ఘనవేదమంత్రాధ్య యనఘోష మెల్లప్పు
డేకనాదం బయి యొసఁగు నెచట
నిత్యాగ్నిసంధాన నీరంధ్రధూమం బ
కాలమేఘం బయి గ్రాలు నెచట
ధ్యానసమాధిబ్ర హ్మానుసంధానతర్క
మించునాదం బోంక రించు నెచట
దివ్యతపోజ్యోతి దినరాత్రములు వెల్గు
జలజాప్తబింబ మై వెలుఁగు నెచటఁ
తే. బ్రబలి దేదీప్యమాన మౌ బ్రహ్మతేజ
మంచితంబుగ మూర్తిభ వించు నెచట
నవిరతానందమారీకృ తాధు లై స
మస్తవస్తువు లానంద మయము లెచట. 106
సీ. ముక్తిరమాదేవి ముఱిపెంపుసామ్రాజ్య
భద్రాసనం బయి పరగు నేది
ధర్మగోవు చరించు తమకంపు లేలేఁత
పచ్చికబయ లయి హెచ్చు నేది

పుణ్యాలి శుకపాళి ముద మారఁ బొదుఁగంగ
మేల్పంజరం బయి మెఱయు నేది
శాంతిసీమంతినీ శయనంపుమురువంపు
మగరాలమేడ యై మిగులు నేది
తే. సత్యమునకును నునికియా స్థాన మేది
దయకు దాక్షిణ్యమునకు నిధాన మేది
భోగభాగ్యమ్ములకు నాదిప్రోది యేది
యేచుకళ్యాణములకుఁ గాణాచి యేది. 107
సీ. తపసికుఱ్ఱలు వాడు నుపనిషత్తుల నెందు
శారికాదులు చర్చ సేయుఁ
దాపసుల్ బోధించు తత్త్వబోధము నెందు
గోమృగాదులు విను గోలు సేయు
ఋషు లాచరించు నహింసవృత్తుల నెందు
వ్యాఘ్రహర్యక్షాదు లాచరించుఁ
దపసు లనుష్ఠించు జపయోగముల నెందుఁ
నతిదీక్ష వృకాదు లభ్యసించుఁ
తే. దాపసులు చూపుహృత్ప్రసాదత్వ మెందు
సరససరసులు నభ్యాస సరణిఁ ద్రొక్కుఁ
దత్తదుచితోచితం బగువృత్తి నెందు
సర్వమును మౌనిమయ మయి చాటుచుండు. 108
మ. కల దేవంవిధభవ్యదివ్యమహిమాగణ్యంబు విధ్వస్తహ్వా
ద్వలమానాతివిరోధిజంతుతతికార్పణ్యంబునుఁ మోక్షల

ష్క్యలఘుభ్రాజితరాజమందిరవరేణ్యాంబుల్ మహాపుణ్యము
న్విలసన్మానిశరణ్య మొందు జగతిన్ సిద్ధినై మిశారణ్యమున్.

వ. అందు. 110

ఉ. శాంతము సజ్జనద్రుమవసంతము నిర్మలనిత్యసమ్మద
స్వాంతముగీయమానగుణవంతనుము క్తిరమాసమాధ్వసం
క్రాంతము సర్వభూతమతికాంతము వాంఛితసర్వకార్యసి
ద్ధ్యంతమువింతగొల్పునునిరంతరమెంతయునంతటంతటన్.

మ. జననాదిప్రతిబద్ధనై జకలహాస్పర్ధల్ విరుద్ధరంబుగాఁ
జన లోజంతుల నాటలాడుచు 'సమస్సర్వేషుభూతేష'టం
చనుగీతోక్తి బహూకరించి ఘనసింహవ్యాఘ్రఖడ్గాదులా
ఘనతత్త్వార్థము బోధసేయు విమలజ్ఞానప్రబోధంబుగన్.

మ. ఉదయాస్తంబుల యుక్తకాలమున సూర్యోపాసనాభ్యా
సనం, బెద నుల్లాసము నుల్లసిల్ల సలుపుండీ యంచు బోధిం
చు; నల్ల దళంబుల్ ముకుళీకరించి బహువాల్లభ్యంబునన్
దమ్ము ల, భ్యుదయానందపరంపరాగుణితభక్త్యుద్రేక
ముదాస్థితిన్. 113

మ.అనయమ్మున్ హరి! శ్రీహరీ! కమలనాభా! దీనబంధూ!శివా!
యని రేయింబవలున్ నిమేషమయినన్ వ్యర్థంబుగాకుండఁ
బల్కునియోగంబున శారికాదులు 'సదా గోవిందసం
కీర్తన', మ్మనునార్యోక్తినియుక్తినిం దెలుపు భక్త్యాసక్తి
సంయుక్తి మై. 111

వ. ఏతాదృగ్గుణగరిష్ఠం బగునయ్యరణ్యశ్రేష్ఠంబున ద్వాదశ వార్షికసత్రయాగదీక్షాపరతంత్రతనరు దెంచినశౌనకాదిమహా మునులు భగవద్లీలానేతిహాసశ్రవణపరాయణు లై నిఖిల రహస్యవిజ్ఞాత యగుసూతముని నేతం గని. 115

మ. అనఘాత్మా! సకలశ్రుతిస్మృతిపురాణాదిప్రపంచార్థబో ధనవిజ్ఞాత! తపఃప్రపూత! మునిధాతా! సూత! యేదేనొకం డనఘుం బౌనితిహాసముఖ్య హరికథాన్యాసంబుమాకుం గృప న్గని తెల్పంగదె మానసంబు పరమానందాబ్ధినోలాడఁగన్.

వ. మఱియు బ్రహ్మమునీంద్రా! 117

తే. అరయఁ దఱచుగ లోకంబులందుఁ బ్రాణి
తతికి నారోగ్యపుత్రపౌత్రధనధాన్య
భోగభాగ్యాయురానందమోక్షసంప
దాదికము గోరువాంఛలు నలముఁగాదె. 118

వ. కావున. 119

శా. దానంబా? వ్రతమా? తపంబ? పరతీర్థస్నానమా? దేవతా
ధ్యానంబా? జపయోగమా? నిఖిలపుణ్యక్షేత్రయాత్రాదులా?
మానంబా? భగవత్కథాకథన నామస్తోత్రపూజాదులా?
దేనం గల్గెడు వాంఛితార్థము లమందీభూతసంపత్తితోన్.

వ. అనతీయవలయు నని మఱియు. 124

ఉ. చూడఁగ వక్త గల్గునెడ శ్రోతలు గల్గరు; శ్రోత లుండినన్
గూడఁడు వక్త; రెండు నొనఁగూడినఁ బుణ్యవిపాక మే; వినన్

వేడుకఁగల్గు మాకుఁ బరవేత్తలు మీరలు సంభవించుని
ష్పాడితలంప నేము; తొలి బామునఁ జేసినపుణ్య మెట్టిదో!

వ. మఱియును మహాత్మా! 123

చ. గురుఁడు ఘటింపఁబోఁడు; కడకుం ఘటియించిన ధర్మబో
ధనాభిరతుఁడు చిక్కఁడు; డొక్కట లభించినఁ జెప్ప వలంతి
గాఁడు; డటులే, దొరకును బో శ్రుతిస్మృతివిదుండును
గాఁడు; భవాదృశుండు స, ద్గురుఁడు లభింప నెందులను
గొండొకలోటును గానరా దిటన్. 124

వ. అనవుడు సూతుండు ప్రీతుండై. 125

ఉ. ఓఋషివర్యులార! పరయోగసమాధియుతాత్ములార! సా, ధా
రణరీతి మీరుద్ధు లుదాహరణం బగునొక్కొ? నాయెడన్
జీరి హరిప్రసంగమును జెప్పఁ డటంచుఁ బ్రశంస నేయు
టన్, గోరికఁ జెప్పువాఁడఁ దమిగో లొంటవన్ హరినాథ
గాథలన్. 126

చ. అడుగకమున్న తిన్నగ నయక్రియలన్ దరిఁజేర్చి నేర్పినట్లు
డుగక విష్ణుగాథ లతియుక్తి వచించుట న్యాయముండఁగా
నొడఁబడి భక్తితత్పరతనోపిక ప్పావికథాప్రధానులై
యడిగిన నూఱకుండ నగునా? తగునా? మఱి వేఱుచేసినన్.

వ. మఱియు. 128

తే. అడుగువారలు లభియింప రడిగినంత
వినెడువారును నుండరు విన్నయంత

తెలియువారలు గల్గరు ౯ తెలిసినంత
యాచరించెడివారును ౯ నరయ లేరు. 129

క. శ్రోతలు జ్ఞాతలు గల్గిన
యాతఁడె శ్లోకంబు శ్లోక ౯ మయ్యెడు లేక
జ్ఞాతలు శ్రోతలు గల్గిన
నాతఁడె లావత్తు పోయి ౯ యది శోక మగున్. 130

వ. కావున నట్లు గాక. 131

శా. శ్రద్ధావర్ధితభక్తియుక్తులు పర౯బ్రహ్మానుసంధానసం, బద్ధా
త్ములా హరినామకీర్తనరతుల్ ౯ ప్రజ్ఞావిశేషుల్ తపో,వృద్ధుల్
జ్ఞానులు శాంతిదాంతియుతులు౯ ౯విజ్ఞాతలుం గల్గ నా
శుద్ధబ్రహ్మమహామహత్త్వమును ౯ శ్లోకింపఁగాలభ్య మే!

వ. కావున ననన్యభోగ్యం బగునబ్భాగ్యంబు మీ రడుగుటం
జేసి నాకు౯ భోగ్యం బయ్యెం గావున నాయెఱింగినంత
విన్నంత తొల్లినారదునకు నీరజనాభుం డెఱింగించినతెఱంగు
మీ కెఱింగింతు ననిన చెప్పందొడంగె. 133

## కథాప్రారంభము.

ఉ. నారదమౌని లోకకరుణాపరతం బదునాల్గు లోకముల్
దారుచు నచ్చటచ్చటివి౯ధానపువింతలు నేకరించుచు౯
జేరె నొకానొకప్పుడు వి౯శీర్ణశుభవ్రతపారలోకము౯
ధారితదుర్వ్యథాబహువి౯ధాకృతశోకముమర్త్యలోకమున్.

వ. చేరి. 135

తెలియువారలు గల్గరు తెలిసినంత
యాచరించెడివారుసు నరయ లేరు. 129

క. శ్రోతలు జ్ఞాతలు గల్గిన
యాతఁడె శ్లోకంబు శ్లోక మయ్యెడు లేక
జ్ఞాతలు శ్రోతలు గల్గిన
నాతఁడె లావత్తు పోయి యది శోక మగున్. 130

వ. కావున నట్లు గాక. 131

శా. శ్రద్ధావర్ధితభక్తియుక్తులు పరబ్రహ్మానుసంధానసం, బద్ధాత్ముల్ హరినామకీర్తనరతుల్ ప్రజ్ఞావిశేషుల్ తపో,వృద్ధుల్ జ్ఞానులు శాంతిదాంతియుతులున్ విజ్ఞాతలుం గల్గ నా శుద్ధబ్రహ్మమహామహత్త్వమును సుశ్లోకింపఁగాలభ్యమే!

వ. కావున ననన్యభోగ్యం బగునబ్భాగ్యంబు మీ రడుగుటం జేసి నాకున్ భోగ్యం బయ్యెం గావున నాయెఱింగినంత విన్నంత తొల్లినారదునకు నీరజనాభుం డెఱింగించినతెఱంగు మీ కెఱింగింతు ననిన చెప్పందొడంగె. 133

## కథాప్రారంభము.

ఉ. నారదమౌని లోకకరుణాపరతం బదునాల్గు లోకముల్
దారుచు నచ్చటచ్చటవిధానపువింతలు సేకరించుచున్
జేరె నొకానొకప్పుడు విశీర్ణశుభవ్రతపారలోకమున్
ధారితదుర్వ్యథాబహువిధాకృతశోకముమర్త్యలోకమున్.

వ. చేరి. 135

ట్లని తలపోసె శ్రీపతి యనంతకృపామతి డెక్కగాఁ
దగున్. 141

చ. అని తలపోసి కొంతవడి నయ్యెడ నయ్యెడునట్టికార్యరీతిని
దలపెట్టి పో బయలుదేఱె నదే పయనంబు గా హరి
స్థనుఁగొను కౌతుకంబున ననల్పసముజ్జ్వలదివ్యధామముఁ
సనకసనందనాదిమునిసాధ్వభిరామము విష్ణుధామమున్.

వ. అట్లు బయలుదేఱి వైకుంఠలోకంతంబునకుం జని యిందిరా
వల్లభుమందిరంబు నల్లన సమీపించి యందు. 143

సీ. నీలమేఘముడాలు గేలి సేయఁగఁ జాలు
నిద్దంపుజిగిమేను నెరయువానిఁ
దారకాధిపునోరు సారుఁ గేరఁగఁజారు
వదనారవిందంబు వఱలువాని
నచ్చంపుఁదెలిదమ్మిపొచ్చె మెన్నఁగఁ బెచ్చు
పెఱిగెడుకందోయి వఱలువానిఁ
గెందమ్మియందమ్ము డిందించుసుందర
చరణారవిందముల్ నెరయువాని

తే. జాను గనఁబూనుకరచతుష్టయమువాని
శంఖచక్రాదులుం గేలఁ జాలువానిఁ
బీతవాసుని వనమాలఁ బేరువాని
దివ్యమూర్తినిఁ బొడఁగాంచె దేవమౌని. 144

క. పొడఁగని యెడఁగనిభక్తిని
గడుకొని యిట్లని నుతింపఁదగాఁ దొడఁగెను న

ప్పుడు హరిదర్శనపులకని
బిడతనుఁ డై తన్మయుఁ డయి ౯ వినయవినతుఁ డై. 145

సీ. నిత్యాయ సత్యాయ ౯ నిగమాంతచారాయ
నిగమాంతవేద్యాయ ౯ నిర్గుణాయ
నిర్వికారాయ నిర్నిద్రాయ భద్రాయ
సచ్చిదానందాయ ౯ శాశ్వతాయ
దేవాదిదేవాయ ౯ దేదీప్యమానాయ
నారాయణాయ సనాతనాయ
యోగగమ్యాయ విరాగవిద్వేషాయ
తత్త్వార్థబోధాయ ౯ సాత్త్వికాయ

తే. నిర్మలాయ నిర్మోహాయ ౯ నిర్మమాయ
వాఙ్మనోతీతవిభవాయ ౯ పావనాయ
సర్గసంస్థాలయకరాయ ౯ సర్వగాయ
సాధకాయ నమోనమో ౯ మాధవాయ. 146

సీ. వటపత్రశాయినే ౯ వాంఛావిధాయినే
మోక్షప్రదాయినే ౯ రక్షకాయ
సకలావతారిణే ౯ సాధూపకారిణే
యోగిహృచ్చారిణే ౯ భోగదాయ
హితరమాతోషిణే ౯ స్మితపూర్వభాషిణే
దండితదోషిణే ౯ తారకాయ
భక్తసంహ్లాదినే ౯ బంధనోత్సాదినే
సంపదుత్పాదినే ౯ సర్వదాయ

తే. శీలినే వనమాలినే పాలకాయ
చక్రిణే ఖలవక్రిణే సన్నుతాయ
భాసినే చిద్విలాసినే భాస్వరాయ
మానినే తే నమోనమో మాధవాయ. 147

శా. నీమాయల్ తరియింప లేరు గద! వాణీజాని రుద్రాదులే
యేమాత్రుల్ పెఱవార లల్పమతు? లీయీరేడులోకంబు
లున్, నీమాయాప్రతిభావిలాసము, కృపాస్నిగ్ధైకసందృష్టి
మాయామోహాంధుల నుద్ధరింపఁగదె! కృష్ణా! శ్రీజగ
న్నాయకా!. 148

వ. అని యిట్లు స్తుతించుచు వచ్చుచున్న తపోగరిష్ఠుం డగునమ్ముని
శ్రేష్ఠుకంఠనాదంబు మోదంబుగఁ జెవికిన్ సోఁక సాదరం
బుగ; నంబుజోదరుండు. 149

ఉ. దిగ్గన లేచి చూచి యెటుదిక్కుననుండి నినాద మయ్యెనం
చొగ్గిచెవిన్దవీయమయియొక్కటనిక్కను నేయకుండఁగన్
డగ్గఱుటం గ్రమక్రమమునన్ నిజభక్తునికంఠనాద మం
చగ్గల మైనప్రేమ విని యంత విశారదు నారదుం గనెన్.

చ. కని యెదురేఁగి వేగిరము గా ముని డాసి నివాసభూమికిం
తన గొనిపోయి యాసనసనాథునిఁ జేసి హితోపచారము
ల్పనివడఁ దీర్చి యోగకుశలంబులు ప్రశ్నము నేసి నేదదే
ఆ నిఖలవేత్తయ త్తపసి రాకడ జోక యెఱుంగ నిట్లనున్.

తే. తాపసోత్తమ! యెందాఁకఁ దరలు టిపుడు?
నెమ్మి దయనేసినట్టికార్య మ్మదేమి?

యేమి నీమనోభావంబు ల్లేమి యాన ?
యుఱక వత్తురె! మహానీయు ల్లోరులకడకు. 152

వ. అనవుడు బ్రహ్మానందనుండు. 153

శా. దేవా! యీ వెఱుఁగంగరాని దయి ప్రత్యేకంబుగాఁ
దెల్పనో, భావం బొందు మనంబునం గలదె? సర్వజ్ఞుండ
వీవైననుఁ, నావార్తావళి వచ్చినట్టిపని విజ్ఞాపింతు సర్వంబు
నా, పై విశ్వాసము చూపి యానతిడఁగాఁ బ్రార్థింతు నిష్ఠా
ర్థినై. 154

క. స్వామీ! యాభూలోకము
లో మానుషలోకముఁ విలోకించితె? యే
మేమో దౌర్జన్యవ్యా
యామంబులు పెచ్చుపెఱిగె నత్యుచ్చము లై. 155

వ. ఎట్లంటేని. 156

శా. నానాక్లేశపరంపరాగ్రసితులుఁ నానామనోవ్యాధులుఁ
నానాదుష్కృత దుష్టకర్మ్మలు నానాయోనిసంభూతులుఁ
నానాజాడ్యనిపీడ్యమానులును నా నాజాతిసాంకర్యులుఁ
నానాశోకవిదీర్ణమానసులునుఁ నానాదురాచారులున్.

శా. దేవబ్రాహ్మణభక్తిశూన్యులునుదన్నిందాప్రధానవ్రతుల్
సేవావృత్తిపరాత్తచిత్తులుఁ బరశ్రేయోసహిష్ణుల్ కుమా
యావాదుల్ కులదూషకుల్ కపటసన్న్యాసుల్ గురుద్రో
హులుఁ, జీవద్రోహులు మాంసవిక్రయులు దుశ్చింతాగ్ని
దగ్ధాత్ములున్. 158

తే. వేయు నేటికి? సర్వేశ! ప్రాయికముగ
స్వస్వకర్మంబులవలని పాపంబుచేతఁ
గ్లిశ్యమానమానసులై యదృశ్యమాన
పారదుఃఖాబ్ధి మున్గుచున్నారు జనులు. 159

ఉ. కావున నీవిపత్తు తొలఁగం గలుగం దొలికర్మమోక్షముం
గావలమున్ నశించి తలఁగన్ మెలఁగం గులకర్మనిష్ఠులన్
వావిరి యానుపాయ పునఃపాయము పాయ సమస్తదో
షముల్, దేవ! యిదే నొకండు కడతేరఁగఁ దేరఁగఁ బాఱఁ
జూడవే!. 160

తే. చూచి లఘువుగాఁ జూచి కాంచి సంప
దలకుఁ గాఁ జూచి యేచినదయ చెలంగు
నేని నాపైని నద్దాని నెఱుకపఱుపు
మంత విన సంతసం బెంతొ స్వాంత మలరు. 161

మ. అనుడుం బన్నగశాయి యిట్లనియె లోకానుగ్రహార్థంబు
చేసిననీప్రశ్నము సాధుసాధువును బ్రశ్నింపంగయోగ్యం
బునుం, గనుకన్ వత్స! ముదం బెదం బొదవ దేనన్
మోహాపాథోధు లింకి నశించుం గడదాఁటుఁ జేటులును
దానిన్ నీ కెఱింగించెదన్. 162

శా. వత్సా! యొక్కవ్రతంబు గోప్య మనవాప్యంబుం ద్రిలో
కంబులన్, సత్సౌభాగ్యసమృద్ధముం గలదు, వాత్సల్యం
బునన్ నీక య, త్యుత్సాహంబునఁ జెప్పనెంచితి సమస్తోద

ర్కతర్కంబుతో, నుత్పాదింపు ముపద్రవంబులఁ బ్రచారరో
ద్యోగి వై యీపయిన్. 163

తే. సకలసంపదుపేతంబు సన్నుతంబు
సన్నుతవ్రతజాతసరోన్నతంబు
సతనుకళ్యాణభోగసమావృతంబు
నావ్రతము సత్యనారాయణవ్రతంబు. 164

వ. అద్దాని. 165

ఉ. అంచిత మైనభక్తి తోలఁ కాఁగ నిష్ఠయుఁ గూడఁగా నను
ష్ఠించినచో యథావిధి గడింది బెడందలు డిందిపోఁ బటా
పంచము లై యెడంబడక వైళమ పొల్పడు మోక్షలక్ష్మి
వై, రించి! తలంచి యెంచిన స్ఫురించ దొకించు కకించ
నత్వమున్. 166

వ. అని పరాత్పరుం డనుగ్రహాతత్పరుం డై యెఱింగించిన.

క. అంతట మౌనివరేణ్యుఁ డ
నంతుని గని తా వివశు వై జిజ్ఞాస
సంతస మంతకు నంతకు
స్వాంతమునం బెనఁగొనంగ నపు డి ట్లనియెన్. 168

ఉ. ఎవ్విధి నాచరింపవలె? నెయ్యది దీనినిబంధనంబు? లిం, దెవ్వ
రుదైవతంబు? ఫల మెయ్యది? యెన్నఁడు నేయ నౌను?ము
న్నెవ్వరు నాచరించి? రిఁక నెవ్వరు చేయఁగ నర్హు లైనవా?
రివ్వి సవిస్తృతిం దెలుపవే! శుభశీలన! భక్తపాలనా! 169

వ. అని యడిగినంత నాదినారాయణుండు తపఃపరాయణున కి
ట్లనియె. 170

తే. వ్రతి యగునతండు శుద్ధాంతరంగుఁ డగుచు
వ్రతము సలుపంగఁ దనదుభావమునఁ దలఁచి
పిదప నిష్టుల కెఱిఁగించి తదనుమతిని
వలయుపరికరములఁ గూర్పవలయు ననఘ! 171

తే. అంత దీక్షితుఁ డై సకలాప్తబంధు
వృద్ధ విద్వత్సువాసినీ భృత్య జనులఁ
గూడి మంగళవాద్యాళితోడ స్వస్తి
వాచనముతోడఁ జనవలె వ్రతముభువికి. 172

తే. శంఖచక్రగదాపంకజాతకరచ
తుష్టయుఁడు పీతవాసుండు నిష్టదాత
సత్యనారాయణస్వామి సర్వగామి
యీవ్రతోపాస్యదైవంబు ఋషివరేణ్య!. 173

మ. సకలోపద్రవనాశకంబును నశేషశ్రీసమాయోగముఁ
వికలీభూతసమస్తపాతకము ఖర్వీభూతదుఃఖమ్మునుం
బ్రకటానందము మోక్షదాయకము శశ్వచ్ఛ్రీయముఁ
సార్వకాలికమాంగల్యద మీవ్రతంబు; ఫల మీలీలఁ
దగుఁ నారదా! 174

శా. ఎన్నండేని ప్రదోషవేళను సతీవృద్ధాత్మజాప్తాళిసం
పన్నుండై స్థిరభక్తితత్పరత నవ్యగ్రుండు నై స్వామి శ్రీ

మన్నారాయణు దేవదేవు విధివన్మంత్రోక్తపూజాదికం
బున్నిష్ఠ నెఱవేర్పఁగావలయుసంపూర్ణాంతరంగంబుతోన్.

వ. అనంతరంబ కదలీఫల గోఘృత గోక్షీర గోధూమపిష్ట శర్క
రాపంచకంబునుగోధూమపిష్టశర్కరాభావంబునశాలిచూర్ణ
గుడంబు లొక్కొక్క పాదభాగంబుగ మిశ్రితంబు సేసి నివే
దించి విధ్యుక్తంబుగఁ బూజాకల్పంబు నిర్వర్తించి యంత.

తే. ఇష్టబాంధవసభ్యసమేతుఁ డగుచు
నిక్కథాశ్రవణము సేసి చక్క గంధ
పుష్ప తాంబూల దక్షిణల్ పొసఁగ నొసఁగి
శిష్టజనులను దనుపారఁ జేయవలయు. 177

వ. అంత నిశాంతంబునందు శుద్ధస్వాంతంబున. 178

మ. ఒనరం దీక్షించి నిత్యకృత్యములు నిత్యోపాసనల్ దీర్చి శ
క్త్యనుసారంబుగ బ్రాహ్మణాదులకు మృష్టాన్నంబు సంతృ
ప్తిగ, ల్గినయందాఁక భుజింపఁ బెట్టియు ననల్పీభూత మౌద
క్షిణల్, తనుపారంగ నొసంగి భూసురులచేతన్ దీవనల్
వొందియున్. 179

వ. అనంతరము తానునుం గుడువవలయు. 180

క. ప్రతిమాసము ప్రతివత్సర
మతులితవిభవంబుతో సమంచితముఁగ నీ
వ్రత మాచరించుచో నే
వితమునన్ నేగొదువ పడదు పృథుభోగములన్. 181

ఆ. వీరు వ్రతము సేయఁ గారని చెప్పంగ
వలనుపడదు వేఱ తెలుప నేల?
భక్తజనుల కిది యుపాస్యంబు; దేవతా
భజన సేయునెడ విభాగ మున్నె? 182

తే. ఎందఱెందఱో యీవ్రతం బిద్విధమున
నాచరించి మహావైభవాళితోడ
నైహికాముష్మికసుఖంబు లంది స్వామి
కృపకుఁ బాత్రులై దివ్యచారిత్రులైరి. 183

వ. అని దేవదేవుండు దేవమౌని కెఱింగింప నమ్మునియు
నప్పుణ్యాత్ము లెవ్వ రానతిండని యడిగె నని సూతమహర్షి
నైమిశారణ్యమునివరేణ్యుల కెఱింగించుటయు. 184

ఆశ్వాసాంతము.

మ. ప్రయతప్రాంచితశోభమానఘనశోభాభాస్కరా! భాస్కరా
వ్యయచంద్రేక్షణ! యీక్షణప్రసరజీవల్లోక! లోకావళీ
శ్రియమాణాత్మపదాబ్జ! యబ్జభవగౌరీనాథదేవావళీ
క్రియమాణస్తుతిమాల! మాలితగుణా! శ్రీసత్యనారా
యణా! 185

మాలిని:—

శ్రుతిశిఖరవిహారా! శోభితానేకహారా!
హితజనపరిరక్షాధీనలీలాకటాక్షా!
తతజలధిశయానా! తాపసస్వాంతయానా!
సతతవిభవభావా! సన్నుతా! సత్యదేవా!. 186

గద్యము:—

ఇది శ్రీమత్సకలదేవతాప్రసాదిత శ్రీబాలామేధాదక్షిణామూర్తిమహామంత్రోపాసనాసాదిత సంస్కృతాంధ్రకవితాసామ్రాజ్యపట్టభద్ర కావ్యతీర్థ బిరుదముద్ర మద్దులపల్లి వంశపయఃపారావారరాకాతారాకళత్ర నృసింహసిద్ధాంతిపుత్ర విద్వత్కవిజనానుగుణ్య వేంకటసుబ్రహ్మణ్యకవిప్రణీతం బైన సత్యనారాయణమాహాత్మ్యం బనుపుణ్యప్రబంధంబునందుఁ బ్రథమాశ్వాసము.



శ్రీః.

# సత్యనారాయణమాహాత్మ్యము.

## ద్వితీయాశ్వాసము.



శ్రీ తారకనామ! పరం
జ్యోతిర్ధామ! తులసీదళోజ్జ్వలదామా!
భూతాద్యభిరామ! కృత
ఘ్యాతృజనక్షేమ! సత్యదైవలలామా!. 1

వ. అవధరింపుము లక్ష్మీవల్లభుండు మునివల్లభున కెఱింగించినట్లు నిఖిలరహస్యవిజ్ఞాత యగుసూతమునినేత నైమిశారణ్య మునివరేణ్యుల కిట్లనియె. 2

సీ. ఏవీడు సిరిజోడు గోవిందుపదభక్తి
నిధులచేఁ జాలపెన్నిధులచేత
నేప్రోలు శివఁ బోలు ఘృతశాలివామభా
గములచే సర్వభోగములచేత
నేపట్టణము వాణిఁ గోపు బ్రహ్మానువా
దములచేఁ బెక్కునాదములచేత
నేయూరు మిన్నూరుఁ రాయనిదాయ స
త్సవముచే సంతతోత్సవముచేత

తే. కొమరు మీఱుకలియుగవైకుంఠపురము
పంటలిల్లాలికలుములకుఁ బైఁడిమేడ
వైభవములచే బుద్ధిభావములచేత
నేపురం బొప్పు నీభువి నేప్పు తోఁప. 3

వ. ఆపురంబు. 4

తే. కలుములిల్లాలిచల్లనికాఁపురంబు
గాఢవైభవోన్నతి నలకాపురంబు
గొనబుమేలిమిబంగారుగోపురంబు
దాపురంబు ముక్తికిఁ గాశికాపురంబు. 5

వ. మఱియు. 6

మ. పురుషార్థంబుల ప్రోక, పాక సిరిపూవుంబోఁడికిం, బుణ్యపుం
బరిపాకంబుల నాక, మోకము శుభప్రాచుర్యసంప్రాప్తికిం,
బరిశుద్ధిన్ మినువాఁక, కోరికల కల్పశ్రీక, మత్యున్నతిన్
ధరణీలోకవిలోకనీయ మగుచుం దత్కాశి భాసిల్లెడిన్.

ఉ. ఆపురి కాఁపురంబుగ ధరామరుఁ డొక్కరుఁ డుండు
ధర్మసం, దీపితకర్మఠుండు కులదీపకుఁ డాగమవేత్తయున్
యదృ, చ్ఛాపరిలబ్ధతుష్టుఁ డురుశాంతుఁ డుదాత్తుఁడు
బంధుపోషణ, ప్రాపితమానసుండు బహుభారకుటుంబి
యుఁ బేదవాఁడు నై. 8

శా. ఆభూమీసురుఁ డేమి లేమి నిజభార్యాపుత్రరక్షార్థ మై
యేభంగిన్ దరితాప దోఁచక మహాహీనాత్ముఁడై దీని వేం

ల్గా భావించి దినంబునన్ 'భవతి! భిక్షాం దేహి' యం చర్థిమైఁ
దా భిక్షాటన సేయుచుండెను నసాధ్యం బైననిర్భాగ్యతన్.

మ. ప్రతియూరుం ప్రతిపల్లె నిల్లునిలు ప్రారంభించి యప్పాఱుఁ
డున్, జతనం బొప్పఁగ నెట్టులేన్ వలయుబిచ్చం బెత్తి యే
వేళకేన్, సుతదారాప్తసుహృజ్జనాతిథులఁ బ్రోచున్ దృప్తి
మీఱన్ యథో, చితరీతిన్ బహుధా శ్రమంపడి మదిం
జింతించుచున్ దుర్దశన్. 10

వ. ఇట్లు గడపుచు నవ్వేదవిప్రుం డొక్కొక్కప్రొద్దు యాయ
వారంబెత్త బొత్తిగఁ బోవం జాలక యొత్తిగిలం జిత్తంబు
మెత్తవఱచుకొనియు. 11

సీ. ఏలీల గాలించి ॰ పాలించి చూచిన
నిప్పచ్చరపుటింటి ॰ నేలపట్లు
అన్న మమ్మా! యని ॰ యాఁకొని డాకొని
వాపోవుపసికుఱ్ఱ ॰ వాండ్రపాట్లు
కడరానియిడుమల ॰ నెడపఁజాలక దైవ
లీలకుఁ గుందుని ॰ ల్లాలిపాట్లు
ఆడియాస నేతెంచి ॰ కడ కేమి లేకేఁగు
బిచ్చమెత్తెడువారి ॰ విన్నఁబాట్లు

తే. కొసకుఁ గడుపులో నంపపుఁ ॰ గోఁతలట్లు
వ్యథలఁ బెట్టంగ నాథాత ॰ వ్రాఁతకట్లు
పొసఁగి యుబ్బంతుల నెసంగు ॰ నొసట నిట్లు
తప్పదని యేఁగు బిచ్చాని ॰ కెప్పటట్లు. 12

వ. అట్లేఁగి తనయభాగ్యదశకు విసిగి. 13

ఉ. ఆకులపాటుతో నహారహమ్మనరానివ్యథావృథాత్ముఁ డై
యోకరుణాసముద్ర!హరి! | యోకరిబాంధవ!దీనబాంధవా!
యీకడగండ్లపాల్పడఁ దరి | యింపఁగరానియభాగ్యవార్ధిలో
నాకట! మున్గిపోవునను | నాదటఁ బ్రోవు మటంచుఁ గు
య్యిడున్. 14

వ. మఱియు. 15

సీ. మండువేసంగిలో | మధ్యాహ్నవేళల
డప్పి ముప్పిరిగొన | డస్సి డస్సి
కడుపారఁ దిన లేమిఁ | జెడుగునత్తాఁకలి
సొగియింప నందందు | సొరిగి సొరిగి
క్రమ్మరి యిల్లిల్లు | బమ్మెరవోయి యే
లీలనో క్రొంతకు | లేచి లేచి
యూరూరఁ దిరుగాడి | యూరు సేరఁగ లేక
చెట్టుగుట్టలనీడఁ | జేరి చేరి

తే. రోఁతజీవితమునకును | రోసి రోసి
గ్రుడ్డిదైవంబు కనఁ డని | కుంది కుంది
నడువ లేకయు నెట్లెట్లొ | నడిచి నడిచి
యెట్టకేలకు నిలు సేరుఁ | బట్టు పట్టి. 16

వ. ఇవ్విధంబున నాబ్రాహ్మణుండు. 17

చ. తినుటకుఁ గూడు లేక పలు | త్రిప్పట లొందఁగ లేక పుత్త్ర
లం, గనుఁగొని తాళ లేక కల | కాలము కష్టము లోర్వ లేక

యా, చనకును బోవలేక యగచాట్లకుఁ బాలగుచుండె
నక్కటా!, దిన మొకయేఁడుగాఁ గడపుదీనునిజీవిత మెంత
కష్టమో! 18

తే. ఎన్నివిద్యలు గల్గిన నేమి ఫలము?
ఎంతపరివార ముండిన నేమి గలదు?
ధన మనెడుజీవకళ యొండు తఱఁగియున్న
వాఁడు భువిలోన జీవచ్ఛవంబ గాదె! 19

క. ఎది సేసినఁ దది ముట్టఁగఁ
బదిలంబుగ నుంచి నొక్కపట్టున నెదియేఁ
గొదవ యనిపించు బ్రహ్మకు
నిది నైజము; వేదజడున కెట్లగు సరిగాన్? 20

తే. అల్లదాసుత్రిప్పలు పెరుమాళ్ల కెఱుక
యట్లు నాబ్రాహ్మణునియగచాట్లు దెలియ
నేరితర మౌను? నాజగదీశ్వరునకు
నొక్కనిక తక్క నెక్కడ లెక్కగొనిన. 21

వ. ఇవ్విధంబున నెట్లేని సంసారంబు గడపుకొనుచు. 22

శా. మోమోటంబునఁ బోయినూరు మరలంబోఁబోక యొక్కొ
మ్మడిఁ, భూమీభాగము నెల్ల నిల్లుగ శ్రమంబుల్ లెక్క
కుం దేక య,బ్భూమిదేవుఁడు క్రుమ్మరిల్లునెడ సంపూర్ణా
నుకంపార్ద్రుఁడై,స్వామి,శ్రీకరి రాజబాంధవుఁడువిశ్వాసంబు
వాసింపఁగన్. 23

సీ. సిరాక్కవిదోవతుల్ కి నిడివిపింజెలు దీడి
జానుమీాఱంగ నెకమ్మైనఁ దాల్చి
అఱుత రుద్రాక్షమాకలావళు లమరించి
ధవళయజ్ఞోపవీకతము ధరించి
భూతి నలంది త్రికపుండ్రరేఖలు దీర్చి
నొసటఁ గుంకుమురేక కి పొసఁగ దిద్ది
కుడిబుజంబునయందు కి మడిసంచి తగిలించి
కరమున నూఁతగాఁ కి గఱ్ఱఁ బూని
తే. వృద్ధవిప్రునివేసంబు కి వేసి యతని
నుద్ధరింప వచ్చెడిదైవకమో యనంగ
వసుధ మూర్తీభవించినక బ్రహ్మదీప్తి
వోలెఁ బొడకట్టె నవ్విప్రుకమ్రోల నట్టె. 24
వ. అప్పు డప్పేదవిప్రుండు సవినయంబుగ. 25
క. పొడకట్టె డాయ నరుదెం
చెడిద్విజునకు వందనంబు కి నేయఁగఁ దా న
ప్పు డఖిల మెఱిఁగియు నెఱుఁగని
బడి నమ్మాయావి యడుగుఁ కి బాంథుఁడపోలెన్. 26
క. ఓమహానీయా! తమ దే
గ్రామం? బేడ కపరాహ్ణకాలమునం ది
ట్లీమిడిమిడియెండను బడి
యేమో మిసిమింతుఁడ వయి కి యేఁగెదు చెపుమా. 27
భ. పుడమిసురేంద్ర! యెందు నొక కి భూసురవాసము గాన

రాదె? యీ, మిడిమిడికాలువేళ మిత్తి మీఱెడునాఁకలి
డప్పులేఁచి యి, ట్లొడుదొడు క్రైనఁ బోవలెనె? యీరులు
పల్లెలు గోష్ఠవాటములె, యొడలునఁ బ్రాణ మున్న శుభ
ముండెడు రండు విధేయునింటికిన్. 28

వ. అని యిట్టు లక్కపటవిప్రుండు నిక్కంపుభక్తి చక్కంబఱచి నొక్కినొక్కి యెంత ప్రార్థించినను ధర్మభీరుం డై నిలువ నియ్యకొనక యి ట్లనియె స్వామీ! 29

క. శోకించి కుట్ట లాఁకట
నాకై కాచి యెవరేని నాయన యదిగో
యాకడ వచ్చెడువాఁ డని
పోక నిరీక్షింత్రు నిక్క మునిగాళ్లపయిన్. 30

వ. కావున నోకృపాత్మా! నిలువ నోప నని చెప్పి ప్రత్యుత్తరం బుగాఁ దనవృత్తాంతం బి ట్లనియె. 31

ఆ. రోఁత గాదె! ఱోళ్ల రోఁకళ్లఁ బాడినఁ
దీఱుబోని నాదుదీనచరిత
మైనఁ జెప్ప మన్న దానఁ జెప్పెద నింక
గాఁపురంబు కాశికాపురంబు. 32

ఉ. పేటికి నాచరిత్ర మిదమిత్థ మటంచు వచింప బొత్తిగాఁ
గూటికిఁ గుందకమ్ము వడి కొందల మందుచు నెట్టకేని భి
క్షాటననేసి యాలు సుతులందఱిప్రాణము నిల్పుకొందు; వే
యేటి కభాగ్యదేవత యహీనదశం దలఁ దన్నియుండెడిన్.

ఉ. పొట్టకు రోసి బిచ్చమునకుఁబోయిన నావెను నంటి వచ్చుఁబో
కట్టె దరిద్రదేవత సహాయము గాన జగానఁ గాన నా
యట్టియభాగ్యుఁడెందులను నైనఁగలండె?యిఁకెన్నఁడేనియి
క్కట్టులుదీఱి సౌఖ్యపడు కాలమువచ్చునె? భూసురోత్తమా!

వ. మఱియు నాదుర్దశ నేమని పాడుకొందు. 35

సీ. ఒకలేమ ననుఁ జూచి పకపక నవ్వును
నొక్కయాయమ మూతి ముక్కు విఱుచు
నొక్కపడంతి న న్నెక్కడనో చూచి
మున్ముందుగాఁ దల్పు మూఁత వేయు
నొక్కతె పతి యేమొ యొసఁగఁ బోవుచునుండ
నెగఁబోసి యీసంత జగడ మాడు
నొకతల్లి చెయి దీర దొకమాఱు ర మ్మను
దెప్పి దెప్పి యొకర్తు తెచ్చి పెట్టు
తే. నాయభాగ్యము నాకన్నఁ నడచు ముందు
నూఱ కుండిన నెట్లు? లేకున్న నెట్లు?
వెనుక గొయ్యి ముందఱ నుయ్యి యనినవిధము
తోఁచఁ జావునకు మొగము వాఁచియుందు. 36

వ. అనుచు మఱియు నాయీదౌర్భాగ్యంబు పాఁచికొన నోఁచి
కొనక పోవుటయ కాక వెర వగు తెరువు కఱ వయ్యెఁగా
యని నుడువ సులభదయోదయుండు గాన నాభక్తవత్స
లుండు దయామయుండై. 37

మ. అసమానవ్యసనాతిదైన్యమున నీకట్లప్పాలుఁడుం జెప్పని,ర్వ్య
సనుం డయ్యెఁ బరాత్పరుండు నిజభక్తార్తాయత్తచేతస్కుఁడై
కుసిలించెం బయిఁ బొంగుదుఃఖమునుసంకోచించిలోలోనన
క్కసటౌమాయకులోనుగానయినదుఃఖం బెంతరాకుండెడిన్?

వ. ఇట్లు కొంతవడి కమ్మాయావి శాంతించి యిట్లనియె. 39

ఉ. ఓధరణీసురేంద్ర! విధియోగము నీఁగ వశంబె? యల్లగం
గాధరునంతవాఁడు గతి గానక భిక్షుపుఁబాత్రఁ బట్టె నిం
కీధర మానవుం డనఁగ నెంతటివాఁ?డ గుఁగా కుపాయముల్
శోధనచేసిచూతముమనుష్యునియత్నము మీఱకుండఁగన్.

మ. తనచేనయ్యెడిదే 'మవశ్య మనుభోక్తవ్యంకృతంకర్మ'యం
చని యుండంగను నైనఁగాని మనచేనైనంతయత్నంబు చే
సినమీఁదన్ భగవానుఁడుండుఁ గనుకంజింతింపఁగా నేలకూ
డినకష్టంబులు సౌఖ్యము ల్నియతిఁబాటింపంగనిత్యంబులా?

వ. కావున. 42

మ. వెతలం జెందకు మోడకుండు మిఁకఁ బ్రాప్తించున్ సుఖం
బన్ని కాం, క్షితముల్ దీరు నొకం డుపాయము నెఱింగి
గింతున్ దగన్ విష్ణు సు, స్థితిసంపాదక మిష్టసిద్ధికర మాశ్రీ
సత్యనారాయణ, వ్రత మొండుం గల దీయిలాతలసుదు
ర్లభ్యంబు ధాత్రీసురా! 43

మ. అని మాయావి దయామతిన్ వ్రతముమాహాత్మ్యమ్మునుం
జెప్పి దా, ని ననుష్ఠించెడుకల్పముం దెలిపి యానేమం
బెఱింగించి యం,తన తా వీడ్కొని పోయినట్ల చని యంత

ర్ధాన మయ్యెఁ ద్విజేంద్రునిదారిద్ర్యము తోడుతేరఁగను
వోయెడ్తో భద్రసంధాయి యై. 44

వ. అంత నప్పేదవిప్రుండును నావ్రతప్రాప్తి పెన్నిధియుంబోలెఁ
దలంచి యల్లనల్లన యిల్లు సేరి. 45

క. మల్లడిఁగొనునుల్లాసం
బుల్లమునం దుల్లసిల్లఁ నుప్పొంగుచుఁ దా
నిల్లాలి కెల్లవృత్తము
వెల్లంబుగ నెఱుకపఱచెఁ దేటపడంగన్. 46

వ. పదంపడి యాప్తవర్గంబున కెఱింగించి. 47

తే. తద్వ్రతంపు సంకల్పశతంబు సోఁకఁ
బ్రిదులుమనసునఁ గంటికిఁ నిదుర రాక
యెంతటికి వృద్ధి యయి రాత్రిఁ యేఁగి పోక
బడలి యారాత్రి పుచ్చెఁ గల్పంబుజోక. 48

వ. అట్లు పుచ్చి కాల్యకృత్యంబులు నిర్వర్తించి యావ్రతంబు
సేయ సంకల్పించి తద్ద్రవ్య సంపాదనార్థంబు భిక్షాటనంబు
వోవం దలంచునవసరంబున. 49

శా. ఆనాఁ డెల్లరు నెల్లవస్తువు లసంఖ్యాకంబుగాఁ గూర్చి య
త్యానందంబున నింత కాద్విజుఁడు రాఁడాయెంగదా యంచు
న్నాలోనం గార్యము మించిపోయినయటుల్ లుంగిళ్లఁ దారా
డిరే,నానార్థంబులుచేరిరావు?సకలాంతర్యామిప్రేమించినన్.

వ. ఇట్లున్నయెడ నమ్మహీసురుండు. 51

మ. ఘనకౌతూహలజాతనూతనతదేకధ్యానలీనాత్ముఁడై
చనుచో దైవకృపావిపాకమున నశ్రాంతిక్ ముహూర్తం
బులో, నన నాఁడాదరపూర్వకంబుగను నానాద్రవ్యసం
భారముల్, తనివోఁ బ్రాప్తము లయ్యె మించుముద మ
త్యంతం బనంతంబు గాఁ. 52

వ. తదనంతరంబ. 53

ఉ. ప్రాప్తము లైనద్రవ్యనిచయంబులతో నిలు సేరి బంధుమి
త్రాప్తజనావళిం గలసి యాపరమేశ్వరు సత్యదేవు లో
కాప్తునిఁ బూజలం దనిపి సాంగముగా వ్రతమాచరించె బ్ర
హ్మాప్తుఁ డకల్మషస్థితివిధాచరణాదరణైకబుద్ధితోన్. 54

వ. తత్క్షణంబ. 55

ఆ. నిండువెతలు దీఱె నిలువేదఱిక మాఱెఁ
గష్టదశలు పాఱెఁ గలిమి చేరెఁ
గాలగతులు మాఱెఁ గల్మషములు తాఱె
శుభములు సమకూఱె సుఖము మీఱె. 56

వ. ఇట్టు లద్ధరామరుండు. 57

తే. వరుస సత్యనారాయణస్వామివ్రతమ
హాత్త్వమున ధన ధాన్య పుత్త్రాది సకల
సంపదలఁ దులఁదూఁగి పరంపరాభి
వృద్ధి నిండోలగం బుండె వేడు కలర. 58

ఆ. అప్పు డేఱు దాఁటి తెప్ప గాల్చినయట్లు
గాక యావివేకి యేకభక్తిఁ

దద్వ్రితంబు నమ్మి తన్నిష్ఠమెయి నుండె
సత్యదేవుమీఁద స్వాంత మునిచి. 59

మ. ఇటు లాబ్రాహ్మణుఁ డావ్రతంబును బరార్థి భూతతద్భక్తి
లం, బటతర్ మాసము మాసముల్ సలిపి విధ్వస్తాఘుఁడై
జ్ఞానియై, యట సంపూర్ణసుఖానుభూతి మని యాత్తేచ్ఛా
నురూపంబు పిమ్మట దేహంబు దొలంగి విష్ణుపదముం బ్రా
పించె శ్రీ మించఁగన్. 60

వ. అని యివ్విధంబున. 61

క. మును నారదునకు శ్రీహరి
యనుమతి వినిపించె దీని నని సూతుం డిం
కను గథనీయం బెయ్యది?
యన నైమిశమౌను లనిరి హర్షం బెసఁగన్. 62

ఉ. బ్రహ్మమునీంద్ర! దీనిఁ దెలుపంగదవే! దయచేసి యంత నా
బ్రాహ్మణువల్ల నీవ్రతము ప్రస్తుతి కెక్కె నెటుల్ ధరిత్రి? ని
ర్జిహ్మముగా మ త్తే రతనిచేఁ దెలుపంబడి చేసి? రాపర
బ్రహ్మకథాసుధాప్తి తలఁపం దనివోవదు స్వాంత మెం
తకున్. 63

ర. అనవుడు రోమహర్షణి దయామతి వారల కిట్లు చెప్పఁబూ
నెను వినుఁ డంచు నల్లధరణీసురుఁ డొక్కతఱిన్
మతింతభ, క్తిని సకలాప్తబంధుసమితిన్ మితిమీఱెడు
వైభవంబుతో, డను వ్రత మాచరించెడునెడన్ సరి
మధ్యమ కాలమందునన్. 64

సీ. ఎగదోపి కట్టినసగము చిన్గినపాత
యసియాడుకటిభాగమందు నలరఁ
జిఱుచెమ్మటల్ గ్రమ్మి చెదరి కాల్వలు గట్టి
సన్న సన్నగ దిగజాఱుచుండ
ఆఁకలిడప్పులయలఁతచేఁ బెదవులు
వదనంబుఁ గడు నెండఁబాఱుచుండఁ
గడుదవ్వుపయనంపుటడజడిచేతఁ గా
ల్నడక లంతంతకుఁ దడఁబడంగ
ఆ. మెడలు కుదివడంగ నిడుదకట్టెలమోపు
నలవి మాలి శిరమునందు వెలయఁ
దనువు దాల్చినట్టి దారిద్ర్యదశవోలె
వేగ నొకఁడు వచ్చె వీథివెంట. 65

వ.అంత. 66

ఉ. కట్టెలు కట్టెలో యని విశోకస్వరనాదము చుట్టుపట్టు బో
పెట్టఁగఁ గేకవేయుచును వీథిబడిం బడి తొంటివిప్రుని
ల్లట్టున కేఁగుదెంచి బహుశ్రమంబయియేఁచెడుతుత్పిపాసలం
దట్టుకొనంగ లేక పరితాపము నాఁప జలార్థియై యటన్. 67

ఉ. దాపున నున్న తొంటివసుధాసురగేహబహిఃప్రదేశసం
స్థాపితకాష్ఠభారుఁడయి ద్వారము ముంగిలి దాఁటి కాంచె ని
ర్వాపితమోహముగ వ్రతపారాయణభక్తజనేహముగ బరి
స్థాపితసత్యపూజనపదార్థసమూహము మధ్యగేహమున్.

వ. కాంచి తన్మహోత్సవ సందర్శనానందరస మందీభూతపిపాసుండై ముందునకుం దాయం బోయి దీక్షితుండగు యజమాను నీక్షించి నమస్కరించి యి ట్లనియె. 69

ఉ. భూసురవంశభూషణ! ప్రభూతవిభూతి సమేత మిట్లు నీ
చేసెడిదేమి? పేరెదియొ! చేసినదాన ఫలంబదేమొ! వి,శ్వా
సముఁ జూపిదీనిఁ దెలుపం గదవే!యని వేఁడుడుఁ మహో
ల్లాసము వాసి మీఱఁగ నిలాసురుఁ డింధనజీవి కిట్లనున్.

మ. మహనీయం బిది సత్యదేవవ్రత మస్మద్భాగ్య ముచ్చై
శ్శుభా,వహ మిష్టార్థఫలప్రదం బఖిలసంపద్వైభవోత్పా
దకం, బిహలోకామితసౌఖ్యభోగదము సద్వృత్తిప్రదా
నంబు ప్ర, త్యహమాంగల్యము; నింత స్వానుభవసిద్ధాం
తంబ నిక్కంబుగన్. 71

వ. మఱియు నీవ్రతంబు. 72

సీ. ధనధాన్యములప్రోవు ఘనసంపదలఠావు
వెలయుకోర్కులలావు వేల్పుటావు
కర్మంబులకు జాడ ధర్మంబులకు నీడ
భవవార్ధిదరిఁ జూడఁ బఱచునోడ
ఘనపుణ్యములచోటు కలుషంబులకుఁ జేటు
నాపదావళినీటు నణఁచువ్రేటు
మోదంబులకు గట్టు మోక్షలక్ష్మికిఁ బట్టు
మంత్రార్థములగుట్టు మనికిపట్టు

తే. అతులభక్తివరాల్పూట • యశముబాట
కలితపరలోకసుఖజాల • కల్పసాల
మోలి విజ్ఞానరస మంద • మూలకంద
మెన్న నిద్దాని కెనఁ గాన • మిజ్జగాన. 73

వ. అని యిట్లు తద్వ్రతమాహాత్మ్యం బెఱింగించి తన్నిదర్శనార్థంబుగా. 74

మ. తనదారిద్ర్యము దాననైనవెనుబాధల్ త్రోవలో వృద్ధవిప్రునియభ్యాగమనంబు విప్రువలనంబుణ్యవ్రతావాప్తివెం టన తా నావ్రత మాచరించుటయు నంతం దత్ప్రభావంబునఁ, ధనధాన్యాది పురోభివృద్ధియును యాథాతథ్యముం జెప్పినన్. 75

శా. డెందంబందునఁ జింది క్రందుకొని రాధిఁగాఢమైనట్టియానందం బంతకు నంత వెల్లివిరియం దద్భక్తి యుప్పొంగ గోవిందప్రీణన మైనయావ్రతము సేవింపం బ్రసంగించి యంతం దీర్థంబు ప్రసాదముం గొని కృతార్థమ్మన్యుఁ డై యంతటన్. 76

తే. తద్వ్రతాసక్తచిత్తుఁ డై • తనపురంబు
చేరి యావ్రత మెట్లని • సేయవలయు
ననెడికౌతుక మంతంత • కతిశయింపఁ
దనదు లేమిడి దలపోసి • తలఁచె నిట్లు. 77

తే. స్థిరము 'నాదత్త ముపతిష్ఠ • తే' యటంట
తగును 'బూర్వదత్తం తు య • ద్ధన' మటంట

కాన లేమిడి కిపుడు వగవఁగ నేల?
యన్మి కష్టైల నావ్రత మాచరింతు. 78

మ. అని సంకల్పము చేసి చిత్తమును సత్యస్వామిపై నిల్పియిం
ధనముల్ దెచ్చి వడిన్ మహాధనసమృద్ధం బై విరాజిల్లుప
త్తనవీథిం జనుదేర నాఁటితటి సత్యస్వామిసందృష్టి మిం
చినద్రవ్యంబొనఁగూడసంతసమునం జిత్తంబునిండారఁగన్.

వ. అత్యంతకుతూహలంబునఁ దద్ద్రవ్యంబునకుఁ బరిణతకదళీఫల
గోఘృత గోక్షీర గోధూమచూర్ణ శర్కరాదికము విలిచి
వలయుపదార్థమ్ములం గైకొని. 80

ఉ. కంధిశయానుసత్కరుణఁ గల్గె నివంచుఁ దలంచియెంచియ
య్యింధనజీవి తోఁదలఁగ నింటికి నేఁగి సమస్తవస్తువు
ల్బంధిల నిండువై భవముఁలన్ విధితో వ్రతమాచరించె సం
బంధిజనాళితో సకలపౌరులతో స్థిరభక్తికేళితోన్. 81

వ. తదనంతరంబ తద్వ్రతప్రభావంబున. 82

మ. ఘనుఁడై సౌఖ్యములన్ మహావిభవుఁడై కల్మిన్ సదానందవ
ర్ధనుఁడై వాంఛితకార్యసిద్ధులఁ గళత్రభ్రాతృపుత్రాదిశో
భనుఁడై యభ్యుదయంబులన్ గమలనాభస్వామిభక్తిప్రబో
ధనుఁడై తద్వ్రతసేవలన్ వెలసె నిర్ధాత్రిం బ్రపుణ్యాత్ముఁడై.

శా. ఈలాగా భగవద్విధేయుఁడును బెక్కేండ్లా వ్రతోపాసిరై
భూలోకంబునభోగ్యమైనసుఖముల్ భోగించి యాపిమ్మటం
గాలం బొంది యనన్యభోగ్య మగుభాగ్యం బొప్పఁగా
నొందెఁ దా, నోలిన్ శాశ్వతకాలభోజ్యమును సాయు
జ్యంపుసామ్రాజ్యమున్. 84

క. అని యక్కథకుఁడు వినిపిం
చిన నైమిశమౌనివరులు ◊ చెవిపండువుగా
వినియుం దనియక మఱి యా
యనఘవ్రతమహిమఁ దెల్పు ◊ మని వేఁడుటయున్. 85

ఆశ్వాసాంతము.

శా. కారుణ్యామృతపూర పూరితదృశా ◊ కంజాత సంజాత వీ
తీహారూతీహామితవృష్టిసృష్టి శమితా◊శ్రాంతోరు చింతాదహ
ద్దారిద్ర్యప్రళయజ్వలజ్జ్వలనసంతాపా! కృతాలాపదీ
నారావశ్రవణప్రవీణచణక◊ర్ణా! సత్యనారాయణా! 86

మాలిని:—

సగుణవిగుణరూపా! ◊ శత్రుసంహారచాపా!
జగదవనధురీణా! ◊ సాధుమార్గప్రయాణా!
సుగుణమతవిధానా! ◊ సూరిసంస్తూయమానా!
అగతికజనపక్షా! ◊ యాశ్రితత్రాణదీక్షా! 87

గద్యము:—

ఇది శ్రీమత్సకలదేవతాప్రసాదిత శ్రీబాలామేధాదక్షిణామూర్తిమహామంత్రోపాసనాసాదిత సంస్కృతాంధ్రకవితాసామ్రాజ్యపట్టభద్ర కావ్యతీర్థ బిరుదముద్ర మద్దులపల్లివంశపయఃపారావారరాకాతారాకళత్ర నృసింహసిద్ధాంతిపుత్ర విద్వత్కవిజనానుగుణ్య వేంకటసుబ్రహ్మణ్యకవి ప్రణీతంబైన సత్యనారాయణమాహాత్మ్యంబను పుణ్యప్రబంధంబునందు ద్వితీయాశ్వాసము.

శ్రీః.

# సత్యనారాయణమాహాత్మ్యము.

## తృతీయాశ్వాసము.



మానినీవినోదా!
వ్యామోహతమోపనోద పావనపాదా!
కామితఫలప్రదా! ముర
లీమోహనగాననాద! లీలామోదా!. 1

వ. అవధరింపు మట్లు వేఁడినంత నిఖిలరహస్యవిజ్ఞాత యగు సూతమునినేత నైమిశారణ్యమునివరేణ్యుల కిట్లనియె. 2

ఉ. తొల్లి ధరంబరాసమాన దోర్బలుఁ డుల్కాముఖుండునామహీ
వల్లభుఁ డొక్కఁ డుండె భగవద్వినివేశితచిత్తవృత్తి సం
పల్లలితుండు సత్యమితభాషి వివేకధనుండు శౌర్యధై
ర్యోల్లసితుండుబల్లిదుఁడు నూర్జితకీర్తి జితేంద్రియుండునై.

శా. ఆరాజన్యుఁడు మూఁడువేళలను దేవాగారముల్ మెట్టియే
పారన్ శ్రీరమణీమణీరమణుపూజాదుల్ నివర్తించి సం
భారంబుల్ ధరణీసురాళికిడి దేవబ్రాహ్మణప్రీతిగా
త్మారాజ్యంబును నేలు మానధనుఁడై సప్తాంగసంపన్నుఁడై.

తే. తనరు భద్రశీల యన నాతనికి భార్య
సహనగుణధుర్య ప్రాణపతిహితచర్య
భూరిశృంగారగురువర్య పూజితార్య
మహితకార్య పతివ్రతామతాళిధార్య. 5

వ. ఇట్లుండ నొక్కనాఁటియవసరంబున. 6

శా. ఆసమ్రాట్లోకమేటి యేటిదరిపుణ్యక్షేత్రమం దాత్మకాం
తాసంతాన సుధీవిధేయ సుహృదాప్తవ్యాప్త సద్గోష్ఠితో
శ్రీసత్యవ్రత మాచరించునెడ వచ్చెన్ బేహారంబుగా
నాసన్నంబగునోడ రేవునకుఁదాయన్సాధుఁడనై వైశ్యుఁడున్

క. అంతట బేహారముకై
సంతనచేసినసమస్తసంభారధనా
భ్యంతర మగునోడను దీ
రాంతమునన్ నిలిపి సాధు వాసన్నుం డై. 8

మ. వ్రతదీక్షాపరతంత్రుఁడై నపృథివీభర్తన్ విలోకించి యో
క్షితిపాలా! యతివేలమౌ విభవభక్తిస్థైర్యసంపత్సమ
న్వితమిట్లీయొనరించుకార్యమిది యేమీ? దీని నంతన్ సవి
స్తృతిగాఁ దేటపడంగఁ జెల్పువిన నెంతే సంతసంబయ్యెడిన్.

వ. అనవుడు నద్ధరావరుం డిట్లనియె. 10

ఆ. అనఘ! యెల్లవేళ ధనధాన్యపుత్త్రాది
సకలభోగభోగ్యసంపదాప్తి
వాంఛఁజేసి యిష్టఫలదంబు సత్యనా
రాయణవ్రతంబు సేయువాఁడ. 11

వ. నాపుడు నబ్బేహారి బద్ధాంజలి యై యి ట్లనియె. 12

శా. ఓపృథ్వీశ్వర! నిక్క మీవ్రతము పుత్రోత్పాదకంబేని యే
రూపం బైనను నాచరించెద; నపుత్రుండై సుతుల్ లేనియీ
లోపం బేదఁగ నీదఁ బున్న రకకల్లోలిం గృపాబుద్ధి సాం
గోపాంగంబుగఁ దెల్పవేఁడెదను గల్పోక్తప్రకారంబులన్.

వ. అని వేఁడినంత నబ్భూపాలుండు కృపాళుం డై తద్విధా
నంబు సెప్పం దొడంగి యయ్యార్యశేఖరున కి ట్లనియె. 14

తే. సర్వదుఃఖోపశమనంబు సంతతిప్ర
దంబు సౌభాగ్యదము ధనధాన్యవర్ధ
నంబు శ్రీసత్యనారాయణవ్రతంబు
నున్నవ్రతములయం దుత్తమోత్తమంబు. 15

శా. ఓవైశ్యోత్తమ!యీవ్రతంబు సలుపన్ యోగ్యంబుమాఘం
బుగా, నీవైశాఖముగానికార్తికముగానీవీనియందొక్కమే
లౌవారంబున, సంకటంబులను, యుద్ధారంభకాలంబునం
దావిర్భూతవిపత్తివేళల, నభాగ్యంబందుఁ దప్పాంతికై.

క. ఓసాధూత్తమ! యిది ప్రతి
మాసము ప్రతివత్సరంబు మానక యెపుడుం
జేసినఁ జేయఁగవచ్చును
నీసందర్భమున లేవ వేనియమంబుల్. 17

తే. జయకరం బైనయీవ్రతసత్తమంబు
పూర్ణిమైకాదశీముఖ్యపుణ్యదినము

లందు మేషాదిసంక్రాంతులందుఁ గాని
యెప్పు డేనియుఁ జేయంగ నొప్పుచుండు. 18

వ. మఱియుఁ బ్రాతఃకాలకృత్యంబులు నిర్వర్తించి యంత. 19

శా. నేమంబుల్ జరగించి చిత్తము హరింజెందించి ప్రార్థించి 'హే
స్వామిన్! సత్యవిభో! వ్రతం తవ కరిష్యామి ప్రసన్నః ప్రసీ
దామో దేవ' యటంచు మొట్టమొదటం బ్రారబ్ధసంకల్పుఁడై
యామీఁదన్నవేక్ష్యయర్ధదినసాయంకాలసంధ్యాదులన్.

వ. అంత నానాలంకారశోభితం బైనపూజాగారంబుం బ్రవేశించి యందులం బూజాస్థానంబు గోమయంబున శుద్ధిపఱిచి యైదువన్నెలముగ్గుచే రంగవల్లిం దీర్పింపవలయు నందు నూతనవస్త్రంబు పఱచి తండులంబు లుంచి బంగారం బొండె వెండియు నొండె రాగియు నొండె నిత్తడియు నొండె మృత్తికయు నొండె విత్తశాఠ్యంబు గాకుండ నిర్మించినకలశంబులు స్థాపించి తదుపరి క్రొంబట్టుపుట్టంబు వెట్టి యద్దానిపైఁ గాసెత్తు గాని తదర్ధంబు గాని తదర్ధార్ధంబు గాని యథాశక్తి స్వర్ణనిర్మితంబైన శ్రీసత్యనారాయణ ప్రతిమను బ్రతిష్ఠించి తత్పార్శ్వంబునం దామ్రప్రతిమయందు వరుణదేవు నావాహనంబు సేసి యంత. 21

క. పరమేష్ఠియు విఘ్నేశుఁడు
హరియున్ గౌరియు నవగ్రహంబులు దిక్పా
లురు వీర లంగదేవత
లరయంగ మున్ముందు వీరి నర్చింపఁ దగున్. 22

వ. అందును ముందు కలశంబునం దొక్కప్రక్క వేఱుగా వరుణదేవు నర్చించి తత్కలశోత్తరదిగ్భాగంబున గణేశపంచ కంబును దత్తన్మంత్రవిధానంబులం బ్రాక్సహూప్తిగాఁ బూజించి యక్కలశంబునకుం బశ్చాద్భాగంబునం దాదిత్యాది నవగ్రహంబులం దత్తన్మంత్రంబులచే నుదక్సమాప్తిగాఁ బూజ లొనర్చి ప్రాగాద్యష్టదిగ్భాగంబులయం దింద్రాద్యష్టది కృతుల నావాహనంబు నేసి పూజించి. 23

తే. అంత నక్కలశంబునం ॥ దాదిదేవు
సత్యనారాయణస్వామి ॥ సంస్తుతించి
పూజ లొనరించి వ్రతము ని ॥ ర్వ్యాజభక్తిఁ
జేయ నగు విప్రబాంధవ ॥ శ్రేణితోడ. 24

వ. ఓవైశ్యోత్తమ! యీవ్రతంబు చాతుర్వర్ణ్యంబునందు స్త్రీపురుషు లేరేని యవశ్యంబు సేయందగు; నందు ద్విజ స్సుండు వేదోక్తంబులును బురాణోక్తంబులు నగుమంత్రం బులతోఁ జేయం దగుం గాని తదన్యులు పురాణోక్తమం త్రంబులచేతనే యాచరింపవలయు మఱియు. 25

క. ఒకమా ఱీవ్రతమును జే
సి కారణాంతరముల మఱి ॥ సేయఁగ వీ లుం
డకపోయిన దోషము లే
దొకయించుకయేని దీన ॥ నోయార్యవరా!. 26

క. వ్రత మిద్దాని ననాదర
మతి నై యెవ్వాఁడు సేయ ॥ మాను నతఁడు శ్రీ

పతిహేళనంబు సేయుట
కతనఁ గడుఁగ వెతలఁ జెందుఁ గలకాలంబున్. 27

క. హరివాసర మీవ్రతముఁగ
జరిగించి భుజించి తత్ప్రసాదం; బత్యా
పరమున ద్వాదశిఁ బారణ
జరిగింపఁగ వలయు నాప్తజాలముతోడన్. 28

ఆ. వ్రతము నాచరించునతఁ డతిరిక్తుఁడై
యుండెనేని బ్రాహ్మణోత్తమాప్త
జనుల కెల్లఁ దత్ప్రసాదంబు సత్కృతి
సలిపెనేని పూర్ణఫలము నొందు. 29

ఆ. సత్యదేవుపూజ సలిపి యథావిధిఁ
దత్ప్రసాద మాది ధరణిసురుల
కొసఁగి పిదపఁ దాఁ బ్రియసఖులతోఁ గూడి
భక్షణంబు సేయవలయు నార్య!. 30

క. వ్రతి యిడినప్రసాదం బవ
మతి సేయు నెవం డతండు మానసిదుఃఖ
స్థితి నొందుఁ; బూర్వపుణ్యముఁ
జ్యుత మయ్యెడు నింత లేకయుండఁగఁ దుదకున్. 31

క. గొనకొని వ్రతముం జూడఁగఁ
జనుదెంచినవారికిం బ్రసాదం బీకుం
డినఁ జేయువ్రతంపుఫలం
బును బొందఁడు కిల్బిషంబు పొందును వ్రతియున్. 32

ఆ. సాధుజనుఁడ! యిది ప్రసాదప్రభావ మీ
వ్రతమునందుఁ జెప్పఁబడియెఁ గాన
నీప్రసాద మెవ్వఁడేని శ్రేయస్కాముఁ
డేయెడల నవజ్ఞ సేయరాదు. 33

తే. పెక్కుయజ్ఞంబు లొనరింపఁ దక్కు నెంత
ఫలము, పెక్కుదానంబులు సలుప నెంత
ఫలము గల్గునొ యంతటిపాటిఫలము
ప్రాప్త మగు నీప్రసాదంపుభక్షణమున. 34

క. ఇప్పుడమి నిట్టివొప్పున
నిప్పుణ్యవ్రతము సలుపునేని మనుష్యుం
డొప్పార సర్వసౌఖ్యము
లెప్పుడు శ్రేయములతోడ నెసఁగుచు నుండున్. 35

క. అని యాఱేఁ డాపోఁడిమి
వినిపించిన సాధు వంత విని వాణిజ్యం
బునఁ బోవ మాని యావ్రత
మును జేయుకుతూహలమునఁ బురికిఁ మరలెన్. 36

వ. అంత. 37

తే. వేగఁ గొండంత యాసతోఁ బీడు సేరి
కాంత లీలావతిం బొడగాంచి మించు
ముదముతోడఁ దా విన్నపుత్రదము నైన
యావ్రతపుజాడ వినిచె బేహారిప్రోడ. 38

వ. అట్లు వినిపించి యవ్వైశ్యకులశేఖరుండు కులకాంతతో
ని ట్లనియె. 39

మ. సుదతీ! సంతతి గల్గదే నేని మనకుం సొంపారఁగా నాచరిం
చుద మాశోభనవేళ నీవ్రతము నంచుం జెప్పి తత్సిద్ధియే
ముదలం బెట్టి పరస్పరంబు ఘనసమ్మోదానుభావోదయా
స్పదకేళీవశ చిత్తవృత్తు లయి యిచ్చల్ మీఱఁగా
నున్నెడన్. 40

క. ఆలీలావతి ధర్మ
వ్యాలోలమనస్క యై రమాధీశకృపా
వాలీకృతమతిగతి యై
కాలంబుఁ గడపుచుండఁగా నొకనాఁటన్. 41

తే. సత్యదేవప్రసాదంబు జాలువాఱ
దంపతుల నోముపంటలు దాపుఁ జేరఁ
జుట్టపక్కాలకోరికల్ మట్టు మీఱఁ
గోమలికి గర్భ మయ్యె నక్కఱంత దీఱ. 42

వ. అయ్యవసరంబున. 43

ఉ. కోరిక లుద్భవించెఁ దళుకుల్ చనుకట్టులఁ జొకళించె నూఁ
గారును గప్పు నించె నడు మల్లమదించె నడల్ గతించె మ
న్నే రుచియించె మాంద్యము దయించె నరోచక మంకురించె ని
ట్టూరుపు రాక మించె నిటు లొయ్యన బోటికి నాఁడునాఁ
టికిన్. 44

శా. ఆలీలావతి కొన్నినాళ్లకటు పర్యాయమ్ముగా నిండుచూ
లాలై యొక్కప్రశస్తవేళ స్వజన స్వాంతంబు లుద్దీప్తిచే

నోలిం దేరఁగఁ గాంచెఁదా నుభయవంశశోజ్జీవికామాలికన్
బాలార్క ప్రతిమాన దివ్యతమశోభాజాలికన్ బాలికన్. 45

వ. అంత జాతకర్మంబు నిర్వర్తించి. 46

తే. భానుకళలట్లు దేదీప్యమాన మైన
కళలు కలదౌట నన్నికళలను మేధ
కలుగఁ గలదౌట సార్థంబుగా నతండు
సుతకుఁ బేర్వెట్టెఁ దాఁ గళావతి యనంగ. 47

వ. అంతం గొన్ని దినంబులకుఁ దొంటిసంకల్పము స్మరించి యా
లీలావతీసతి పతితో ని ట్లనియె. 48

క. మును సంకల్పించిన తెఱఁ
గున వాంఛితసిద్ధి యైనకొంతటిసమయం
బున కిప్పటికిని దద్వ్రత
మును జేయుతలంపుతోడ మునుకొన రేలా? 49

క. నావుడు వైశ్యుఁడు కన్యా
వైవాహికకాలమందు వ్రతముం జేయన్
భావించినాఁడ నని లీ
లావతితో సమ్మతముగ లలిఁ బల్కుటయున్. 50

వ. అంత నబ్బాలికయు శుక్లపక్షంపు చేయేలికపోలిక దినదినప్రవ
ర్ధమాన యగుచుండ నాతండు. 51

ఉ. పేరిమిముద్దుఁగూఁతునకుఁ బెండిలిప్రాయము డాయవచ్చిన
న్గోరి నిజాప్తకోటిఁ గరణీయవిధానము సంప్రతించి సు
శ్రీరమణీయ వృత్తకులశీలగుణాన్వితు నీడుజోడు చే

హరిసుతుఁ డర్థమయి యారయఁ బంచెను దూత నేర్పరిన్. 52

ఉ. పంచినదూత యేఁగి ధనవర్ధనశోభనసౌధవీథికా ప్రాంచితమైనకాంచనపురంబుఁ గనుంగొని యందు మేసుహ త్తించినపంచబాణుఁ దన దివ్యకళాసువిలాసభాసునిఁ మంచికొలంబువాని గుణమండితుఁ బండితుఁ గాంచె నొక్కనిన్. 53

క. కాంచి సమంచితముగఁ దనుఁ
బంచినవృత్తాంత మతని బాంధవుల కెఱిం
గించి యతనిఁ దోడ్కొని యే
తెంచె వధూబంధుజనము తృప్తిం జెందన్. 54

వ. అంత. 55

చ. వరునికులంబునక్కులము వన్నెకుఁ దెచ్చెడువృత్తివృత్తికిం దెరు వగుకల్మి కల్మిగుఱితించుగుణంబును దద్గుణం బలం కరణము సేయువిద్యయు జోకాటపువిద్యకుఁ గ్రొమ్మెఱుంగునా వరవినయంబు గల్గుటకు వైశ్యుఁడు సంతస మంది యాత్మలోన్. 56

శా. శ్రీదైవాఱఁగ నప్డు వియ్యమగువారిం జేర రావించి మ ర్యాదన్ బంధులఁగూడి వైభవముగా సాలంకృతం బైనక న్యాదానం బొనరించి మించునటుకల్యాణంబుగావించెఁబూ ర్ణౌదార్యంబునఁ బ్రహ్మలోకచిరవాసాపేక్షితస్వాంతుఁడై. 57

క. అ త్తతతియును భాగ్యమదా
యత్తుం డయి సెట్టి వ్రతము • నరయమి హరియుఁ
వి త్తమద మణఁచుప్రాయ
శ్చిత్తము సేయంగఁ గోపశీలుం డయ్యెన్. 58

వ. అంతం గొండొక్కనాఁడు. 59

మ. మిడిమేలంపుఁగడిందికల్మి బలిమిఁ • మీఁగాళ్లపైఁ జూపులే
ర్పడనవై శ్యుఁడునోడ బేరమునకై • ద్రవ్యంబుచేకూర్చివెం
బడి యల్లుండును రాఁగ స్వార్థపరతఁ • వైళంబుగా నూరువె
ల్వడి తా డగ్గఱె సింధుతీరమును గాలప్రేరితుం డౌటచేన్

ఉ. అందున రత్నసానుపురమందు బెహారము సేయుచుండ నా
సందున సత్యదేవుఁడు విషాదకరంబుగ 'రేపునుండి యీ
మందుఁడు కల్లరీఁడు నసమం బగుదుఃఖము కొంతకాలముం
బొందును గాత' మంచు రుష • వొంది శపించెఁ దపింప
సెట్టియున్. 61

ఉ. నాఁటిదినంబునంద నరనాథుదివాణములోనఁ గాఁపరుల్
మాఁటుమణంగఁ దస్కరులు • మాడలు దోఁచిడి సెట్టియుం
డున, ప్పేఁటకు దాఁటి యం దతనివేదికపై ధన ముంచి
నిల్చుచో, నీఁటియకాండ్రు కొంద ఱలయేలికబంటులు
వెంట నంటఁగన్. 62

ఉ. వొంగలు భంగపాటు గనితోడనె శ్రీహరిచోదితాత్ములై
బ్రుంగువడంగ నద్దన మసరుంగుపయిఁ దిగవైచి తోఁచిన
ట్లంగబలంబునం బఱచి • యాలెకులం గనుఁబ్రామి పోవ వా

రుం గుఱిఁ జూచి దోఁచిన దొరుంగుపయిం గని రోషి
తాత్ము లై. 63

శా. అయ్యింటం గలవారమ్రుచ్చులని యావ్యాపారులంబట్టిమే
న్వ్రియ్యల్ వాఱఁగఁగొట్టివారిధన మంతందీసివారెంతగాఁ
గుయ్యో మొఱ్ఱో యటంచు మొత్తుకొనినం గొంపోయి
రత్యుగ్రులై; యయ్యారే! హరి మోసగించునెడ మిథ్యా
తథ్యముల్ గల్గునే? 64

వ. అట్లు గొంపోయి తమయేలికముందటం బెట్టి జరిగినట్టి
వృత్తాంతం బంతయు నెఱింగింప. 65

క. ఆరాజాగ్రహావిగ్రహుఁ
డై రూక్షము గాఁగ భటుల కాజ్ఞాపించెన్
ఘోరంబుగ బంధింపుఁడు
కారాగారంబునందుఁ గరఁటుల వీరిన్. 66

వ. అంత నవ్వ్యాపారులు భయంపడి యాఁపరానిదుఃఖతాపోద
యు లై భూదయితున కిట్లనిరి. 67

మ. కలలోనైన నెఱుంగ మిట్టిపని భాగ్యంబున్న దోఱేఁడ! చో
రులముం గాము వణిక్కులోద్భవుల మీప్రోలన్ బెహా
రంబును, న్సలుపన్ వచ్చితి మింత నిక్కము మముం న్నిం
పు మం చొక్కట, న్విలపింపన్ వినువారు లే రొకరు
గానీ యెంతదౌర్భాగ్యమో! 68

చ. ఉడుగనియాసతో మరల నూరుజులొక్కటిచెప్పిచూడఁగా
గడచినజేరసారములు గ్రామములోపలివర్తకంబునన్

బెడవడకుండ సాక్ష్యముగఁ బెట్టినవైన నిజంబు దేలుచో
నడవికిఁ గాచు వెన్నెలక్రియన్ వృథ యయ్యెను దత్ప్ర
యత్నముల్. 69

వ. అట్టు లప్పట్టుపుట్టంబు గట్టుజగజెట్టి పట్టుదలం బట్టి పెట్టిన శాపంబుంబట్టి యిప్పట్టున నెట్టు లిట్టిబిట్టుతట్టుకొనరానట్టి యిక్కట్టులం బట్టుచుండ నట నింటిపట్టున. 70

ఉ. మర్మనిధానభేదనసమర్థులు మ్రుచ్చులు రేయిప్రొద్దునన్
నర్మిలిఁ గన్న పెట్టి భవనంబునఁ జొచ్చి సమస్తవస్తువుల్
భర్మమణీమయాభరణపాళియుదోఁచిరి యూఁచముట్టుగాఁ
గర్మము చాలిరానపుడు కల్గెడి వన్ని విపత్తులే గదా! 71

వ. అంత నాలీలావతీకాంత నిశాంతంబున నిశాంతాంతరాళంబు నందింత యేనియుం గానక దురంతచింతాభరాక్రాంతస్వాంత యై వెక్కి వెక్కి పొక్కుచున్న యాగర్భశ్రీమంతురా లగు నక్కుమారిక దిక్కుమొగంబై దిక్కుదోఁచక యిక్కరణి విలపింపందొడంగె. 72

చ. ఒడయఁడు చెంతలేఁడకట! యున్నది దొంగలు దోఁచి
రింటిలోఁ, గుడువను గూడు లే దిపుడు గుప్పిలి గుప్పెఁడు
లేవు గింజలు, న్దొడుగను బట్ట లేదు సుత మాతనయా
వన యైనచోట నే, వడువునఁ బోని ప్రాణములఁ బట్టుదు
నెట్టుదు నిట్టిదుర్దశన్. 73

వ. ఇట్టి యననుభూతపూర్వంబును నాకస్మికంబు నగు దౌర్భాగ్య ప్రాదుర్భావంబున నాగర్భశ్రీమంతురాం ద్రగునయ్యెల్లాం ద్రకుం గట్టకడకు. 74

సీ. పరుల నాసించెడి § బ్రతుకాయెఁ గోతుకాయె
నూత్న దైన్యంబున § నుడులయందుఁ
గడుపార నన్నంబు § కఱవాయెఁ దెరువాయె
నన్న మో రామచం§ద్రా! యనంగఁ
బెట్టిపోసినచేయి § మట్టాయె గుట్టాయెఁ
జెయి సాఁచి పరులయా§చించునపుడు
లేశంబు నింటిలో § లేదాయె రాదాయెఁ
బాదంబు నిలు దాఁటి § బయలుదేఱ
తే. నక్కటక్కట! యక్కాంత § లనుభవించు
క్రొత్త యగురిత్తదశలోనఁ § గొఱఁతవడని
యుమ్మలిక చెప్పఁదరమె? పూ§లమ్ముచోటఁ
గట్టె లమ్మించె దైవమ్ము § పట్టు వట్టి. 75
క. నిర్మల మగుమతి సెట్టి న
ధర్మముపా ల్సేయ నేక§తం బగు? 'బుద్ధిః
కర్మానుసారిణీ' యను
ధర్మము వినఁబడునుగాదె? § తలఁపఁగ జగతిన్. 76
తే. బాస దప్పినదోసంబుఁ§బట్టి సెట్టి
చెట్ట గుడుచుట యుక్తంబ § చేరువారిఁ
గూడఁ బొల్గొంట చెలిమి చే§కొనుట వలయుఁ;
గష్టసుఖముల సతిపతుల్ § గలయవలదె? 77
క. అన్న గత ప్రాణంబుల
కన్నం బిడకున్న బ్రదుకు§నన్నా ళ్లెటు వోఁ?

దిన్నం దినకున్నను నా
పన్నులు వారేఁగవలసెఁ బరగృహములకున్. 78

వ. ఇట్టిత్తప్పనట్టి ముప్పునం దప్పడంతులు బ్రదికి చెడి చెప్పరాని వ్యసనంబునం గుప్పఁగూలి యప్పటి కదియ శరణం బని యప్పురంబున భిక్షాటనంబు సేయ నక్షయపాత్రంబు వట్టి చెరియొక్కప్రక్కం బట్టి తిరుగుచుండఁ గొండొక్కనాఁటి మాపటివేళ. 79

తే. అక్కళావతి రాత్రి యొకరంతప్రొద్దు
నొక్కభూసురునింటిలో నక్కజముగ
నాచరించెడుసత్యనారాయణవ్ర
తంబు గని కథ విని ప్రసాదంబు గ్రోలి. 80

వ. అంత. 81

క. తన్మాహాత్మ్యము మదిలో
న న్మఱవక నమ్మి యది పునఃపునరావృ
త్తి న్మననము సేయుచు నేఁ
గ న్మాతకుఁ దెలుప నింటికేఁగిన పలువాతన్. 82

వ. ఇంతలో నారేయి నింటికడ నొంటి నున్నయీవెతల్లి పిల్ల రాకుండుట కుల్లంబునం దల్లడిల్లుచున్నంత నంతలోఁ జెంతఁ జేరి కూరిమిపట్టి కన్నుల కగపట్టఁ బోనున్నప్రాణంబులం గుదుటపఱచుకొని యాతురంబునఁ గూఁతున కిట్లనియె. 83.

క. నాకన్నతల్లి! యీరే
యేకతమున నెందు నుంటి విందాఁక? శుభం

జే కద? రాత్రిరిభోజన
మేకడ? రాలేక నిలిచితే మొ గదమ్మా! 84

వ. అనిన నక్కళావతి మాత కి ట్లనియె. 85

మ. ఇతరం బేదియుఁ గాదు నిల్చుటకుఁ దల్లీ! యొక్క విప్రోత్త
ముం, డతినిష్ఠ సకలేప్సితార్థఫలదం బౌ సత్యనారాయణ
వ్రతముం జేయుచు నుండఁ గాంచి చెవులారం దత్కథా
మోఘుప, ద్ధతి నాలించి ప్రసాదముం గొని కృతార్థమ్మన్య
నై వచ్చితిన్. 86

క. అని యక్కన్యక వినిపిం
చిన లీలావతి యభీష్టసిద్ధిప్రద మం
చని యావ్రతమును జేయం
గను సంకల్పించెఁ గొండొకటి యెంచి మదిన్. 87

వ. అంత. 88

మ. భగవద్దివ్యకటాక్షదృష్టిఁ దగుసంభారంబు చేకూర్చి బం
ధుగులం బిల్చి యథావిధానము వ్రతానుష్ఠానముం జేసి
'నా, మగఁ డల్లుండును జేసినట్టినెరసుల్ మన్నించి వేవేగ
నో, భగవంతా! యిలు సేర్పు మంచు వరముం బ్రార్థించె
దీనాత్మ యై. 89

వ. అంత దీనావనపరాయణుండు గాన సత్యనారాయణుం
డాయమయెడం బ్రసన్నుం డై. 90

మ. అపరాధంబులు సైఁచి యాదినమె తత్త్రాణేశు నల్లుం
జెలిం, దపియింపించెడు నాన్నృపాలువకు స్వప్నంబందుఁ

గన్పట్టి 'యో, నృపతీ! నీచెఱ నున్న కోమటుల నేఁడే వారి
ద్రవ్యంబుతో, నెప మె మెన్నక వీడు; లేనియెడ నిన్నే
ధింతు నిక్కంబ సూ! 91

క. అని యంతర్ధానం బగు
డు నృపతి యాచంద్రకేతుఁడుం బ్రొద్దునసే
తనకల కెఱఁ గంతయు నిజ
జనమున కెఱిఁగించి వారిసమ్మతిమీఁదన్. 92

క. చెఱఁ బట్టినసెట్టుల ని
ద్దఱ సంకెల లూడఁదీసి త్వరితముగా ముం
దఱఁ దోడ్తెం డన భటు లే
మఱ కప్పుడ తెచ్చి నిల్ప మహిపతియెదుటన్. 93

వ. అప్పుడాజనులును మహీపతికి నమస్కరించి. 94

తే. పూర్వవృత్తాంతమును దలపోసికొనుచు
నల్ప్రతోల్లంఘునాదులఁ దలఁచికొనుచు
విన్నఁబోయెడిమోముల ఖిన్ను లగుచు
భయవికంపితు లైనంతఁ బార్థివుండు. 95

ఉ. కలఁతం జెందకుఁడయ్య! కష్టసుఖముల్ గల్గింప దైవం
బ కా, వలయుఁ మూలము; దైవయోగమున సంప్రా
ప్తించెఁ గా కిట్టిపాటులు; మీకింక భయంబు లే దనుచు
నిట్టుల్ కొంత యూరార్చి మిక్కిలి యాసాగరభావమేర్ప
డెడుఘనక్కిం బల్కి సంతుష్టిగాన్. 96

తదనంతరంబ. 97

తే. క్షౌరకర్మము మంగళస్నాన మాది
రైన విధులు సేయించి సభాంతరమునఁ
బుట్టములు భూషణాదులు కట్టఁబెట్టి
విందు సేయించి వారి నానందపఱచి. 98

తే. మున్ను గైకొన్నధనమునకన్న రెండు
రెట్లు గా నిచ్చి కడు నాదరించి పురికి
క్షేమముగఁ బోయి రం డని సెల వొసంగు
నంత సంతోషభరితాంతరంగు లగుచు. 99

ఆ. పోయి వత్తు మనుచుఁ బుడమిఱేనికి మ్రొక్కి
యాన వడసి యాబెహారు లపుడు
వసతిగృహాము సేరి వైభవం బెసలారఁ
దమపురంబు వోవఁ దలఁచుటయును. 100

వ. అనిచెప్పినంత శౌనకాదు లవ్వలివృత్తాంతం బేమని సూతు
నడుగుటయును. 101

ఆశ్వాసాంతము.

శా. మాయామోహితమూఢలోకమదసంతప్తత్వంధకారస్థల
ద్వావ్యయామోద్ధతదుష్ప్రవర్తనవిపర్యాసప్రయాసప్రణా
శా! యీశానుతప్రభావవిభవానన్యాదృశప్రాభవా!
శ్రేయోదానవిధానదీక్షితగుణా! శ్రీసత్యనారాయణా!

స్రగ్విణి:—
భక్తసంతారకా! పాపసంహారకా!
భక్తిముక్తిప్రదా! పుణ్యలోకాస్పదా!
భక్తిమార్గానుగా! పత్రితశ్రీఖగా!
శక్తిసంజ్ఞాగణా! సత్యనారాయణా! 103

గద్యము:—

ఇది శ్రీమత్సకలదేవతాప్రసాదిత శ్రీబాలామేధా దక్షిణా మూర్తి మహామంత్రోపాసనాసాదిత సంస్కృతాంధ్ర కవితా సామ్రాజ్యపట్టభద్ర కావ్యతీర్థ బిరుదముద్ర మద్దులపల్లి వంశ పయఃపారావార రాకాతారాకళత్ర నృసింహసిద్ధాంతిపుత్ర విద్వత్కవిజనానుగుణ్య వేంకటసుబ్రహ్మణ్యకవిప్రణీతంబైన సత్యనారాయణమాహాత్మ్యం బనుపుణ్యప్రబంధంబునందుఁ దృతీయాశ్వాసము.

శ్రీః.

# సత్యనారాయణమాహాత్మ్యము.

## చతుర్థాశ్వాసము.


నిలయనిజోరా! వి
జ్ఞానాలోకనపథప్రచారా! ధీరా!
నానావిలాసవజ్జగ
తీనాటకసూత్రధార! దివ్యాకారా! 1

వ. అవధరింపు మట్లడిగినంత నిఖిలరహస్యవిజ్ఞాత యగుసూత మునినేత నైమిశారణ్యమునివరేణ్యుల కిట్లనియె నంత. 2

క. మించినవేడుక సాధువు
సంచిత మగుద్రవ్య మంత శకటంబుల కె
త్తించి స్వకీయ జనం జే
తెంచఁగఁ దాఁ బురికి బయలుదేరె శుభము గాన్. 3

వ. అట్లు బయలుదేరి కొంతదవ్వేఁగి మధ్యేమార్గంబున నొక్క యగాధంబగు మహానదిపై నోడప్రయాణంబునం బోవలసి నావికులం బిలిచి యోడ దెప్పించి యందు ద్రవ్యపేటిక

లన్నియుం బెట్టించి సపరివారుం డై తూర్ణంబుగఁ బూర్ణం బైనయోడ నెక్కఁబోవు నవసరంబున. 4

ఉ. మాయల మాయఁజేయుమటుమాయలమారుల మేటిసత్య నారాయణదేవుఁ డీదృశదశా ప్తిని సాధునిచి త్తవృ త్త్యభి ప్రాయ మెఱుంగఁగోరి ముదిబ్రాహ్మణరూపము దాల్చి యాతనిఁ, డాయఁగ వచ్చి హెచ్చగునుడంకువ దీవన లిచ్చి యి ట్లనున్. 5

మ. సతతత్యాగవిభాగదీక్షితకరాబ్జద్వంద్వ! యోసాధు! నే నతిరిక్తుం డగుబ్రాహ్మణుండ మహనీయా! సత్యనారా యణ, వ్రతముం జేయఁ దలంచి దాని కగుపుంభారార్థమై యిట్లు వచ్చితి మీశ క్త్యనుసార మిందులకుఁ గించిద్ద్రవ్య మర్థించితిన్. 6

క. కొండంతటిదేవునకుం
గొండంతటిపత్రి పెట్టుకొనలేము గదా!
కొండొక దయసేయించిన
నిండుమనముతోడఁ బోదు నిలయంబునకున్. 7

ఇంతియగాక. 8

నీ విచ్చినధనముననే
గావించెద సత్యదేవుకఘున మౌవ్రతముం
గావున భగవానుండును
భావంబున మెచ్చి నీకు భాగ్యము లిచ్చున్. 9

క. అని యాచించెడి వృద్ధుని
గని వైశ్యుఁడు పరిహాసించి కానంబడుచు
న్నను ధనగర్వాంధత్వం
బున డబ్బిపు డేమి లేదు పోపొమ్మనియెన్. 10

వ. అనవుడు. 11

ఉ. అక్కుహనాద్విజుండు నతఁ డాడినమాటల కబ్బురంబు
నం, బక్కున నవ్వి యిట్లనె సెబాసు! వణిగ్వర! యెంత
మాట! నీ, కొక్కనికే తగుఁ భళిర! యొప్పుకొనం దగు;
నిప్పుడే గదా, త్రొక్కిన రాలు రొక్కములతో శకటం
బులు తాము వచ్చుటల్! 12

ఉ. ఇంతియ కాదు వైశ్యవర! యీనదిపైఁ జనఁ బిక్కటిల్లు
ద్రవ్యాంతరపేటికల్ పడవలోయం దిట నిండఁగఁ జూచు
చుండఁ బెట్టింతువు గాదె! నేఁ గనుల తివిగఁ గాంచితిఁ
గాదె! యయ్యొ! శ్రీమంతుఁడ వీవు; నాస్తి యనుమాట
తటాలున నాడఁ బాడియే? 13

వ. మఱియు. 14

ఆ. దేశ కాల పాత్ర దృష్టితో నిడు ద్రవ్య
మణువుమాత్రమైన నక్షయంబు
పాత్ర మేను పేద బ్రాహ్మణుండను నేఁటి
పూర్ణిమాదినంబు పుణ్యకరము. 15

వ. కావున. 16

ఉ. సైఁచి వినుండు నాదుకడ సంగతి; కాటికిఁ గాళ్లు సాఁచి
యుఁ, గోఁచికి లేనికాలమున గొప్పప్రయత్నము పెట్టి
కొంటి మీా, తోఁచిన యంతమాత్రఁ బరితోషముగా
దయసేయుఁ డంచుఁ జే, సాఁచితిఁ గాని మీాధనము సర్వ
ము నిమ్మని కోరలేదు గా! 17

శా. నానిర్భాగ్యమ కాని తా మిడిననైనన్ లక్షలా? లేకవే
లా?నూర్లా? పదులా? కనీస మొకరూప్యంబో తదర్ధంబో కా
దేనిం గానియొ; కాని, యిచ్చినదియం తేచాలు శ్రీనాథుపూ
జానుష్ఠాననిమిత్తయాచన వృథా యాసంబు గాకుండఁగన్.

క. అదియును లే దనుచోఁ బో
యెద మఱియొకదాతకడకు నెందులకేనిం
గొదవయె దాతలు? నీ వ
భ్యుదయంబుల నందుచుండు మున్నన్నాళ్లున్. 19

వ. అని యివ్విధంబున. 20

ఉ. మాటలమారి యాహరి సమస్తముఁ దెల్పఁ గృతఘ్నవై
శ్యుఁడున్, బూటకమా యిదేమి? తొలి పుట్టువునందునఁ
బెట్టకియ్యెడం, గూటికి మాలి పుట్టి యిటు కొంపలు
ముంపఁగ వత్తురయ్య? ము,మ్మాటికి లేదు లేదిపుడు మల్లక
పొమ్ము యథాగతమ్ముగన్. 21

క. అనవుడు నక్కపటియు వ
చ్చినపని యిఁకఁ గొంత సావశేషం బని వై

శ్వనిపాగరు తలకు నెక్కిం
పను గాఁబోలు! నిటు సూక్తి మరలం బలుకున్. 22

తే. సాధుసత్తమ! యీకడసారిమనవిఁ
జిత్తగింపుము దాతకుఁ జిత్తశాంతి
యుండవలసినగుణ మందు రుండెనేని
యప్పుడు పసిఁడికిఁ బరిమళ మబ్బినట్లు. 23

వ. కావున. 24

ఉ. హెచ్చినయాసఁ దమ్ము గణియించుచు వచ్చినయర్థి వాని కే
మిచ్చిన నీయకున్నఁ జెవియిచ్చి యొకించుకపల్కు వింటనూ
ర్లిచ్చినయంత వేడుక మతేమిగ నైనను నర్థి వాఁడు తాఁ
జచ్చినవానికన్నఁ బలుచందన మొందఁడె? నిట్టనిల్వనన్.

వ. మఱియు. 26

చ. జననము దుర్లభంబును బ్రశస్తమునైనది మానుషంబుచెం
దినయది కర్మభూమి కడతేఱఁగ సాధనభూత మాటచే
తను నిపుడే సమస్త మగుధర్మము కాఁదగుఁగాన నోట లే
దనునది చేత లే దనుచు నంపుట మంచిది ధర్మపద్ధతిన్.27

మ. తనువా? నిల్వదు, భాగ్యమా? యెపుడు నస్థైర్యంబ,యా
యుష్యమా?, దినముల్ లోఁబడు, జీవితంబనఁ దటి త్తేజంబ
యెన్నాళ్లకే, న్దనతోఁ పాటివి పుణ్యపాపములు; కానన్ముం
దుగా దీప ముం, డినయప్డే యిలు చక్కఁబెట్టునటు వానిం
గూర్ప యత్నింప నౌ. 28

ఉ. పుట్టెఁడు పాపమందుఁ దలకొమ్ము న్కలుగాఁ బడిపోవువారలన్
గట్టునఁ బెట్టఁగాఁ బరమకారుణికోత్తముఁ డర్థివాఁడ కాఁ
బట్టి సుఖప్రదాతయగు వానిసమాగమనంబు గోరి మేల్
దొట్టినసమస్తవస్తువులతో నుపచారము సేయఁగాఁ దగున్.

ఉ. ఉండినవాఁడు రాఁడు, తనకున్నది యీయకయున్న ముం
దు నే, ముండదు; గాన దేదఱికముండును ముం దనుభీతి
చేతఁ బ్రాజ్ఞుం డిపుడే యొసంగుఁ, గృపణుం డిపు డిచ్చిన
లేమి వచ్చు నన్, గుండెభయంబుచే నిడఁ డగోచర మీ
విషయంబు దెల్పఁగన్. 30

ఉ. ఆరయ జంతుజాలమున కంతటికిన్ మనుజాళి కెల్ల నా
హారము నిద్ర భీతి సురతాదు లివన్ని సమాన మందు నొ
ప్పారు వివేక మొండు మనుజాళికిఁ; గావున ధర్మవేత్తలౌ
వారలు తద్వివేకమును వ్యర్థము సేయరు వేళ వచ్చినన్.

వ. మఱియును. 31

మ. కరుణోద్దీపకదీనవాక్కు చెవి సోఁకం బోక మున్నే కడుం
బొరగా నెవ్వఁడు యాచమానజనచేతోవృత్తిపూరింపఁ డ
ద్దురితాత్మున్ భరియింపఁజాలను భరింతుంగాని వృక్షమ్ముల
న్గిరులన్ వార్ధులనైన నంచు మనుష్యోణీదేవి వాక్రువ్వదే!

తే. అర్థిభావంబునందలియాసదుక్తి
వినయ భక్తి ధర్మప్రబోధనము లన్ని
యరసి స్వీయముగ నర్థించి యపుడు మెచ్చి
విష్ణు 'వభ్యాగత స్స్వయం విష్ణు' వనఁడె? 34

మ. చెలమల్ చల్లుకొలంది నూరునటు వెచ్చింపంగ ధర్మార్థమై
కలుముల్ హెచ్చును గాని తగ్గవు; తనుఁ గాన్పట్టి
ధర్మంబులు, గ్గలవే? యర్థికి లేదుపొమ్మనుటకన్నం బత్రమో
పుష్పమో, ఫలమో తోయమొ యిచ్చి శక్తికొలఁదిం
బంపించుటల్ ధర్మమా. 35

వ. మఱియును. 36

ఉ. ఆస్తి గలట్టివాఁ డని సహాయము గోరుచు దేహియన్నచో
నాస్తి యటన్న నుస్సు రని యర్థి తథాస్తనిపోవు నేనివ్య
త్యస్తము నైననన్యుఁడిసమస్తముభాగ్యము;సంతసించియా
శీస్తతి సేసెనేని ప్రభుఁ జేసిన నైనను జేయఁగ్గ్లెడిన్. 37

ఆ. వేదవేత్త యైనవిప్రోత్తమునియందు
వేల్పుమూఁక లెల్ల వెలసియుండు
ననుచు శ్రుతులు వల్కు నట్టిఁ డర్థియై యైన
వానిఁ ద్రోసిపుచ్చువాఁడు గలఁడె? 38

చ. అలమునుజన్మమందుఁ దగినంతటి ధర్మము సేసియుంటనే
కలిగినవారియిండ్లఁ గలుగం గలరై తిరి గాన నిప్పుడుం
గలిగినకాలమంద యొకకాసు నొసంగుచు ముందునాఁటికి
గ్గలిమిని వెంటఁబెట్టుకొని కల్గుఁడి కల్గినవారియిండ్లలోన్.

తే. ఇంటి కొకతులసీదళం బిచ్చిరేని
దైవమున కొక్కదండ, యై తనరినట్లు

తమ్ముబోంట్లెల్లఁ దోఁచుసా॥యమ్ము నేసి
రేని సత్యవ్రతమ్ము నీ॥డేరఁగలదు. 40

ఉ. ఏదియుఁ జిత్తగింపకయ॥ యిట్టితమంతటిభాగ్యవంతులే
లేదని యన్నచోఁ గతులు॥ లేవుగదా? మఱియొక్కచోటన
న్నాదృశులైనబీదలకు; ॥ మంచిగనైన మఱెట్లులైన మీ
రే దయసేయఁగా వలయు॥ నేమె యిటుల్ చెయి సాఁపఁ
గావలెన్. 41

క. ఈచందంబున నున్నవి
చూచినకొలఁదిగను ధర్మ॥సూక్ష్మము లింకన్
మీచిత్తము మాభాగ్యము
నాచెప్పెడి దేమి కలదు? ॥ జ్ఞానుల యెదుటన్. 42

క. అని కపటనటనములతో
వినయముతో ధర్మబోధ॥వేత్తృత్వముతో
వినిపించిన నక్కమటి
యును గినియుచు నిట్లు లనియె॥ నుర్వీసురతోన్. 43

ఉ. ఏసరసంబులయ్య? యివి॥ యెన్నఁడొ లేదని యన్నఁ బోక
యే, మొ సదుపాయపుంబలుకు॥ లూరక పల్కెద విల్లు
గాలుచో, వాసవము లెంచునట్లుగఁ బ్ర॥వాహముపైఁ జను
నష్ట యాచ్ఞ? మీకే సరిపోవుఁ గాని మఱి॥యెవ్వరికిన్ సరి
పోదు బాపఁడా! 44

శా. ఏశాస్త్రంబున నున్నదయ్య? యిపు ॥ డేమే లేదు పొమ్మ
న్నచో, లేశం బేని మొగమోట ముంచకయ ॥ యేలీలన్

విచారింపకే, యాశావేశముతోడ మొండితన మిట్లు
చూపనా? బాపురే!, యాశాపాశము చుట్టుకొన్న తత్తి
న్యాయాన్యాయముల్ తోఁచునే?. 45

ఉ. ఇచ్చినఁ జేయి పట్టుటలు నీయకయుండిన దారిఁ బట్టుటల్
వచ్చినబిచ్చగాండ్రతలవ్రాసినవ్రాఁతలు గాని యేమి నీ
మచ్చికముచ్చటల్! తలలు మార్చెడినీతులు! చూడఁజూ
డఁగా, నచ్చపుమాయదారివలె నాత్మకుఁ దోఁచెదు
చాలుఁ బో మ్మికన్. 46

క. నావుడు మాయాభూసురుఁ
డావైశ్యున కీకృతఘ్నతావేశంబుం
గావించినధనమహిమము
భావించి తలంచె నిట్లు భావములోనన్. 47

ఉ. మాటలు నీటఁ ద్రోసెదవు మాన్యతనూన్యతపాలొనర్తువా
రాటము నాటఁజూతు పరరంజనముం జనఁజేయుదచ్చవా
చాటత గాటఁ గల్పెదవు శాంతము నంతముఁ జేర్తువైననీ
మాట వరాలమూట ధనమా! నతమానవమానహీనమా!

వ. అని కొండొక్క తలంచి మరల నైష్ఠుర్యంబుగ వైశ్యున కి
ట్లనియె. 49

ఉ. బంధురసంపదాఢ్యు లయి ప్రస్తుతి కెక్కియు ధర్మశీలతా
గంధ మొకింత లేనియెడఁ గల్గిన నేమి ప్రయోజనంబు? ని

ర్గంధసుమంబులట్లు జనకాంతుల నూరిచి రిత్తవుచ్చు నీ
యంధుల కంజనంబు వినుమా!యుచితార్థిజనోక్తిపద్ధతుల్.

చ. ధన మది గల్గినందులకు దానము ధర్మము సేయఁగావలెన్
దనివిగఁ దా భుజింపవలెఁ దక్కినసంగతు లేవి యెట్లు లు
న్నను నివి రెండు లేని తరుణంబున నట్టిజనుం డజాగళ
స్తనములు వోలె నుండినను దాఁటిన రెండు సమాన
మయ్యెడిన్. 51

శా. అన్యాయంబననెట్టిదయ్యా? కనుకట్టా? యుద్ధమోసంబ?లో
కన్యాయంబునఁ జెడ్డయాస భగవత్కార్యార్థమై వచ్చినా
జన్యం బొప్పఁగఁ బెద్ద లంచుఁ జెయి సాఁచన్ దానికై
కూపకూ, ర్మన్యాయంబున నే మెఱుంగక జగన్మర్యాద
దూషింతురే? 52

వ.. అని మఱియు సవినయంబుగ నిట్లనియె. 53

ఉ. ఇత్తఱి నింతదూరము రమేశువ్రతార్థము చేయు ప్రార్థన
ల్బొత్తిగ బూదిహోమములె! లోకము మ్రాన్పడ నోరు
వాయఁగా, నెత్తిన నోరు వెట్టుకొని నే వచియించిన ధర్మ
ముల్ కటా!, యుత్తయరణ్యరోదనమె! యోధనికాగ్రణీ!
చిత్తగింపుమా. 54

క. ఎనయనిమాటలు పలికినఁ
దొనకక! 'కార్యార్థినః కుతో గర్వ' యటం
చని యనుకొన్నది యగుదాఁ
కను బరతంత్రుఁ డయి యుండఁగావలెఁ గానన్. 55

మ. తుదిగాఁ జిన్నది విన్నపంబు నెఱిఁగింతుల్ యాచకశ్రేణికిం
గదళీకంటకవృత్తి యాటకతనన్ కష్టంబవ్వుఁడన్ సంపదా
పద లాదైవనిమిత్తముల్ తమకుఁ దోఁచవ లాభమో
నష్టమో, యొదవెన్ ద్రవ్యము నావ నిండ నిపు డంత
తో యింతో లేకున్న దే! 57

వ. అనవుడు నబ్భగవద్ద్రోహి పరిహాసంబుగా వృద్ధున కిట్లనియె.

శా. అన్న ట్టింతయు నిక్కమయ్యెఁ దమయూహాపోహలున్
దోఁచెఁ దొ ల్తన్నమ్మించి ధనంబు చూఱగొన వృద్ధబ్రాహ్మ
ణుం డైతివే!, యన్నా! యెన్నిదినాలనుండి యిటు రా
యత్నించితో గాని హా, యిన్నావన్ లత లాకు లుంచితిని
గాదే! వ్యర్థ మయ్యెం గదే! 58

చ. అని పరిహాసవాక్యములఁ నాడినయప్పురుషాత్ముఁ గోమటిం
గనుఁగొని విస్మితుం డయి మొగంబున లేనగ వొప్ప దేవుఁడి
ట్లనియెను నావలోపల యథార్థముగా లతలాకులైన నీ
వనినటువైశ్యశేఖర యథార్థము లయ్యెడుఁ గాతశీఘ్రమే.

క. అని పలికి కపటవృద్ధుఁడు
గునగున నొకకొంతదవ్వు గొబ్బున దాఁటం
గను నిచట సాధువైశ్యుఁడు
దనపీడ తొలంగినట్లు తలపోసి మదిన్. 60

చ. పస చెడిపోవుభావిగతిఁ బక్కి యెఱుంగక పద్దు గెల్చె నన్
ముసిముసినవ్వుతో నియమముల్ నెఱవేరిచినావయొద్దకున్

వెసఁ జని నీటఁ దేలి కనుపించెడుదానిని జూచి విస్మయం
బెసఁగ నొకింతసేపు తనయిచ్చకు వచ్చినరీతి యెంచుచున్.

మత్తకోకిల:—

దిక్కు లారయు నావలోపలిదిక్కు తొంగి కనుంగొనున్
లక్కముద్రల నూడఁదీసి వెలారుచున్ ధనపేటికల్
చక్కఁబెట్టును బెట్టె లన్నియు సారె కాకులు తీఁగలుం
జిక్కియుండుట కుమ్మలించును జిన్నవోవును జింతిలున్. 62

తరళ:—

మిణుకరించు వితాకుఁ జెందును మేదినిం బడి దొర్లు లో
గొణుఁగుచుండును గేకవేయును గొంపమున్గెనటంచు దా
రుణముగా నెద బాఁదు నేడ్చుఁ బరుండు లేచును
మూర్ఛిలున్, క్షణము తెప్పిలు విస్మయంపడుఁ జాలద్రవ్య
ముపోకకున్. 63

ఆ. చిటికెలోన నింత మటుమాయ మగుటకు
దుఃఖవార్ధిలోనఁ దొప్పదోఁగి
తనదుబుద్ధిజాడ్యమును గాన కమ్మూఢ
వైశ్యుఁ డిట్లు మరలఁ బరితపించు. 64

సీ. "అయిపోవు ననుభీతి నర్ధాన్నమే గాని
కడుపార నెన్నండుఁ గుడువకుండ
ఉప్పు పప్పును లేక యున్నట్టొ లేనట్టొ
గాని యెన్నఁడు రుచుల్ గానకుండ
నంజినంజి యొకింత గంజి త్రాగుట గాని
వార్చినయన్నంబు వాడకుండఁ

దల మాయ దిగఁ బాఱఁ § దాన మాడుటె గాని
యెన్నఁడేని తలంటు § నెఱుఁగకుండఁ
తే. బిసినిగొట్టుతనంబునఁ § గొసకుఁ గడుపు
కట్టుకొని ప్రాణ మొకయెత్తు§గా గడించి
ప్రోగుచేసినధనము గో§ల్పోయితి నిపు
డకట! దైవంబు ప్రతికూల § మగుటకతన. 65

సీ. అన్యాయ మని యెంచ § కప్పిచ్చి యొకరీతి
వడ్డికి వడ్డి చే§పట్టి కొంత
ద్రోహ మఘభీతికి § నోహటిల్లక మించి
తల కొక్క-బేరంబు § సలిపి కొంత
పాతకం బని భయం§పడక కొంపలు ముంచి
తప్పుసాక్ష్యంబులు § చెప్పి కొంత
నరకంబు ధ్రువ మని § పరికింప కొకచెంప
బాకిపద్దులు పెంచి § వ్రాసి కొంత
తే. కన్నకష్టముపడి కూర్చి § కడకు నింత
భాగ్యవంతుండ నై సరి§వారిచెంత
నీటుగా నున్నయంత నా§నోటి కంత
దుమ్ము గొట్టితె! పాపిదై§వమ్మ! యింత". 66

ఉ. అన్నిటఁ జాలివచ్చినఁ దో§మంతకుఁదా మయి దైవమన్న నెం
దున్నది యైనఁ గానక మ§హోద్ధతవృత్తిని విఱ్ఱవీఁగి క
ర్మోన్నతిచేత నాపదల § నొందినయప్పుడు కుప్పగూలి యే

తన్నరు లాడిపోసికొని దైవముపైఁ బడి యేడ్తురక్కటా!

వ. ఇట్టుల పట్టరాని వ్యసనంబున నేలఁ బట్టినసెట్టిం జూచి పెల్లుబ్బుదుఃఖంబున నల్లుం డి ట్లనియె. 68

మ. ఇటులం గన్నులు వోవ నేడ్చి ఫల మేమి? యాఱటం జెందు మెం, ప్పటికేనిఁ మనదోషమే మనల నాపాదించు నాహా! యదెం, తటినిర్భాగ్యమొ! సత్యదేవునివ్రతార్థం బంచు యాచింప నొక్కటె పాతంబుగ లేదు లే దనెడు వాక్యం బయ్యె ని ట్లాటకున్. 69

మ. అమలుం డాద్విజవృద్ధు వట్టిముదిప్రాయంబందు నేతెంచి యాత్మమనోభీష్టముఁ జెప్పి రిక్తదశ కాత్మం గుంది మేల్ధర్మసూక్ష్మములం దెల్పి విధేయుఁ డైనఁబరిహాసం బొప్పునే? కారణార్థము లీరీతిగ నుండ మంచినడతల్ రానెట్లు సిద్ధించెడిన్? 70

చ. పలువతనంబు బైటఁబడఁ బల్కినసీ దగు నేటుపోటుమాటలకుఁ గలంగి లోఁ గటకటం బడి యాద్విజశేఖరుండె యిట్టుల శపియించియుండు; నతఁడుక్ బుతవాదియొ మంత్రవేత్తయో, ఫలితతపఃప్రభావుఁడో ధ్రువంబుగ నయ్యెడు మాట లేటికిన్?. 71

ఉ. ఏయనుమాన మేల? మనయింగిత మారయఁగోరి సత్యనారాయణుఁడో పితామహుఁడో యాశివుఁడో ముదిబ్రాహ్మణాకృతిఁ, మాయగ వచ్చియుండు; నిది మాత్రము

నిక్కము లేనిచో నిటుల్, సేయఁగ నెవ్వ రొప్పుడు రక్కసీ
చెడినారము బుద్ధిలేమి చేన్. 73

మ. క్రిమికీటాదిగ బ్రహ్మదాఁక జగముల్ క్రిందట్లు మీఁదట్లు చే
సి మహోత్సాహముతో నటించు నలలక్ష్మీనాయకుండై నకృ
త్రిమవిప్రుం డిపు డీలతాదులధనశ్రీఁ జేయఁగా నెంత? గా
న మహాభక్తి క్షమింప వేఁడి శరణాపన్నుం గాచి రక్షించెడిన్.

తే. అల్లుఁ డారీతిఁ బల్కినదెల్ల విన్న
యంతలో మొలలోఁతు దుఃఖమ్ములోనఁ
దుదకు మోఁకాటిలోఁతు సంతోష మన్న
యట్లు లోకచెంప సంతోష మంకురింప. 75

వ. అప్పు డవ్వైశ్యుండు. 76

మ. ధరణీదేవుఁడు దూరమయ్యెనని సంతాపించి తొట్రిల్లి యే
వెరవుం దోఁపక తత్పథంబుఁ బడి వేవే చావు పేరెమ్మునం
బరుగు ల్వాఱి యొకింత దవ్వచని యాప్రాంతంబులం
దాధరా, మరుజాడల్ పొడకట్టినట్లు గనుపింపంగా సమీ
పించుచున్. 77

క. అడుగడుగునఁ గుయ్యిడుచు
న్నడఁ బడుచుఁ గ్రమక్రమంబునన్ డగ్గఱి ముం
దడుగుండమ్ములమీఁదం
బడి లేవక శరణటంచు వాకొనుచున్నన్. 78

వ. అంత నక్కైతవబ్రాహ్మణుం డాతని లేవం దీసి సోత్ప్రాసం
బుగా ని ట్లనియె. 79.

శా. ఓహో! యెవ్వరు వీరు? సాధువుల! వైశ్యోత్తంసులా !
యింతయు,త్సాహావేశముతోడఁ బోదు రిపుడెంోదాఁకంబ్ర
యాణంబు? స,న్నాహం బేమియు లేకయుంటి చనుచున్నా
రేమి? హా! గుట్టుగా, బేహారంబున కేఁగుచుంటిరో! సరే
వెళ్లుండు సౌఖ్యంబె గా?. 80.

క. అని యెత్తిపొడుపుమాటల
ననుచుండఁగ సగము చచ్చి యావైశ్యుండుఁ
వినయముతోఁ దనపాట్లను
వినిపించి క్షమింపుఁ డంచు వేఁడం దొడఁగెన్. 81

తే. జ్ఞానమూర్తులు తమసన్నిధానమందు
బుద్ధి నేఱక యవివేకమూలమునను
నోరు జాఱి వచించిననేరములను
సైఁచి నను గృపఁ జూడు మోహత్మాసురేంద్ర! 82.

మత్తకోకిల:—
చేటుకాలము దాపరించి విశేషభాషణ మాడితిఁ
నోటిదోషమె కొంప ముంచెను నోరు కట్టుదు నింక నఁ
నీట ముంచినఁ బాల ముంచిన నీవ దిక్కు మఱెవ్వ రే
పాటివారును లేరు దీనుఁడ స్వామి ! దీనజనావనా! 83

తే. అనుచు వేఁడుచు నడుగుల కడ్డపడుచు
మాటిమాటికి సాగిలపాటు పడుచు

నడుగులం బడె; నాహాహా! యబ్బిన సిగ
యబ్బకుండినఁ బాదంబు లంద్రు గాదె. 84

వ. అంత. 85

చ. వినయవిధేయతల్ గలిగి వేఁడుచుఁ బాదములందు వ్రాలిన
దనపడు వైశ్యునిం గనియు దారదయార్ద్రమనస్కుఁడై సనా
తనపృథివీసురుం డతని తత్త్వ మెఱింగి ప్రసన్నుఁడయ్యెఁదా
మినుకులు వజ్రముల్ మనసు మెత్తనగాదె! ధరామరాళికిన్.

వ. అట్లు ప్రసన్నుం డయ్యు భగవానుండు తనమాయ నెఱిం
గింపక వైశ్యున కిట్లనియె. 87

చ. మతిచెడి మానవాళి యొకమాఱొనరించినచెడ్డచేఁతకుఁ
బ్రతికినయంతదాఁకఁ బడరానివెతల్ పడుచుంట నైజమే
గతజలసేతుబంధనముగాఁ దలపోయక పోనియాసచే
గతమగుదానికై యిటులఁ గన్నులు వోవఁగ నేడ్చి తెచ్చెదే!

ఉ. ఇమ్మెయిఁ గష్టనష్టము లివెల్లను వచ్చు స్వయంకృతాపరా
ధమ్ములవల్లఁ; గావున యథాస్థితి సెప్పెద నాకుఁ దోఁచు జో
స్యమ్మున; భార్యతో మునుపు సంతతి గల్గునయేని నాఁడుత
థ్యమ్ముగ సత్యదేవునివ్రతం బొనరింత మటంచుఁ జెప్పవే?

ఉ. ఆవలఁ బుత్రికాభ్యుదయమైనపదంపడి నూఁడఁ దద్వివా
హావసరంబునం దనియు నప్పుడు లోభముచేత మాన నీ
భావము చూచి సత్యభగవానుఁడు మచ్చరికించి మిమ్ముఁగా
రావసథంబునం బఱచి యన్నిటఁ గష్టము దెచ్చిపెట్టెఁజూ!

శా. మీభాగ్యంబున నా శ్రితావనుఁడు స్వామిద్రోహు
లైనం బ్రతి, జ్ఞాభంగం బొనరించినం గడునవజ్ఞాకారు లై
యుండినన్, నీభార్యామణి యింటియొద్ద వ్రతము ల్సేయంగ
సంప్రీతుఁడై, యీభాగ్యం బిడి మిమ్ముఁ బుచ్చె నని యూ
హింపం దగున్ వైశ్యుఁడా! 91

చ. మఱియును నింతవార్ధకము మాట య టుండఁగ నన్న
వస్త్రముల్, కఱవగు పేదబ్రాహ్మణుఁడ గాంతు మెయిం జెయి
సాఁచి కోర న, త్తఱి మనసత్యదేవుని వ్రతం బనియైనఁ దలంప
కేమిరో, యఱగొఱమాట లాడితి వి దంతయుఁ దత్ఫల
మంచు నెంచుమా! 92

వ. అని చెప్పి. 93

క. ఇది గాక తెలియ దెఁకఁ బో
యెద నన నవ్వైశ్యుఁ డప్పు డిఁక గతి యే ము
న్నది యని చింతిలి మరలం
బదములపై వ్రాలి వేఁడఁ బ్రారంభింపన్. 94

వ. కపటనటనఘటనాసమర్థుండు గావున నబ్భగవానుండును
నింకఁ గొంత సెట్టికి బుద్ధి సెప్పి తనవృత్తాంతం బెఱింగింపం
దలంచి మరల నాతని కి ట్లనియె. 95

శా. అయ్యా! పొంపిరివో వుసంపదలనాఁ డైనారమే? యింత
మాకు యాచించితిరే! సమస్తముదుగన్ క్షోభించినం
గార్యమే, మయ్యా? యియ్యదియే గదా ధనమదాంధ్యం

బన్న! మీబోంట్లకే, మిథ్యాప్రపత్తునఁ గానవచ్చితిమె? యే
మీ మీకృతజ్ఞత్వముల్! 96

మ. తలక్రిం దౌచుఁ దపించినన్ నరులచే తస్సీమ నొక్కింత రం
జిలఁ జేయం దగఁ డెట్టివాఁడయిన, నా శ్రీనాథునిం గూర్చి
సాంజలియై 'శ్రీహరి! నీవ సాయ' మనినన్ సాయం బగుం
గానఁ గేవలవిజ్ఞానవిహీను లైన నరులం బ్రార్థించుటల్
వ్యర్థమే. 97

మ. వ్యసనంబం దపచారమందునను నాపద్బాంధవా! యన్నచో
వెస నేదోయొకమాఱురూపమునఁ దావేంచేసి సర్వేశుఁడా
వ్యసనంబున్ బరిమార్చు!, మానవుని వేయ్యాఱుల్
మొఱల్ వెట్టినం, బస లేకుండును జూడఁగా మనుజసేవా
వృత్తి నీచంబె గా! 98

ఉ. పాయక చెప్పుచో నిసుకపాఁతఱ మానవజాతినీచతల్
వేయును నేల? నీహృదయవృత్తి నెఱుంగఁగ వృద్ధవిప్రుఁడై
మాయగ వచ్చి నీపాగరు మస్తముఁ జేర్చినవాఁడు సత్యనా
రాయణదేవుఁ డేన యని యారయు మింతట నైన
వైశ్యుఁడా! 99

క. అని భగవంతుఁడు కరుణం
దనరూప మెఱుంగఁ దెల్పఁ దద్వైశ్యుండుం
దనమదిని నిల్పి భగవం
తుని గూరిచి భక్తి నిట్లు స్తోత్రము సేసెన్. 100

దండకము.

శ్రీనాథ! నాథా! జగన్నాథ! సర్వైకరక్షా! సరోజాక్ష! నీరేజజాతాది దేవాళి సంస్తూయమానాంఘ్రిపంకేజ! పంకేజ సంభూతలక్ష్మీకటాక్షావలోకోదితానంద! యానందరూపా! మహాచిత్స్వరూపా! సతోయాంబుద శ్యామమూర్తీ! కృపా స్ఫూర్తిమూర్తీ! జగద్ధర్మ సంస్థాపనాంగీకృతానేకదివ్యావతారా! ప్రతాపక్షతాక్షీణరక్షోజనక్షోభవారా! ప్రభూత ప్రభావ ప్రభాభాసమానా! విహీనావమానా! చతుష్పాణి పంకేరుహాలంకృతశ్రీగదాశంఖచక్రాదిదివ్యాయుధా! సర్వ లోకైకమాంగల్యసంధాన బృందారక శ్రేణిజేగీయమానా త్మబోధా! జగత్సృష్టిసంస్థాలయాధారభూతా! వినీతస్వభ క్తావనస్థాపితాత్మీయ చేతోంబుజాతా! సువేదాంతవిజ్ఞాన వేద్యా! మహాతత్త్వవిద్యా! యహంకారఘోరాటవీ సం నిధిక్షా! యదిగ్దీనపక్షా! యనాదీ! యమధ్యా! యనంతా! నిరీహా! విమోహా! యమేయోరు చారిత్ర! నానావిలాసాం చితైతజ్జగత్సూత్ర! మాయాలతాచ్ఛేద! నిష్ఖేద! నిష్కోప! నిర్లోప! యంతర్బహిర్వ్యాపకా! స్థూలసూక్ష్మాధికా! ముక్తి రంగస్థలా! కుక్షిసంస్థాఖిలా! శాశ్వతా! దేవదేవా! సదా యోగిహృద్ధామ! యోసత్యనారాయణస్వామి! నీమాయచే బ్రహ్మరుద్రాదులే మోహపాశంబులం జిక్కి కొండొక్కలై యుండి నీ లెంకి నీరూపు నీచేష్టయుం గానలేకున్న భూలో కమర్త్యుండు నిస్సారసంసారఘోరాంబుధి న్మున్గి మాయాం

ధకారమ్మునం జిక్కి యేదిక్కు నేత్రోవయుం గానలేకున్న నా
బోటిమూఢుండు పాపుండు దుర్వారహంకారగర్వాతిరే
కుండు నీచూపు మాయం దరింపంగ నేపాటివాఁడయ్యా?
యింకం గటాక్షించి కారుణ్యముం జూపి నిత్యమ్ము నీపాదప
ద్మమ్ములం గొల్చునిష్కల్మషం బైనభక్తిం బొసంగించి నీభృ
త్యులం దొక్కనింగాఁ బ్రసాదించి నాతప్పు మన్నించి
సామీప్య సారూప్య సాలోక్య సాయుజ్య సామ్రాజ్య
మిప్పించి నన్నేలు మీశా! రమేశా! మదీశా! నమస్తే
నమస్తే నమః.

శా. ఈశా! నీమహిమంబునందు నొకయింత తే దివ్యవాక్కుల్
విరించి, యీశానాదులె చెప్ప లేరన వచోహీనుండ వాక్రు
వ్వఁగా, నే శక్తుండనె? నీపదాశ్రితుఁడ నానేరంబులన్
సైఁపు ధీ వైశద్యంబుగఁ బూజ సేయుదును యావజ్జీవ
మో యీశ్వరా! 102

క. ఈలాగున స్థాలిత్యము
మాలిన్యము లేనిభక్తిమైఁ దన్మయుఁ డై
చాలగ వైశ్యుఁడు వేఁడన్
గాలించి తదీయభక్తికల్పము నంతన్. 103

క. తుష్టుం డై యాభక్తున
కిష్టార్థము లైనవరము లిచ్చి సమస్తో
త్కృష్టంబుగ; నచ్చోటన
దృష్టి కగోచరుఁడు నయ్యె దేవేశుండున్. 104

ఉ. అంతట సాధుఁడు వ్వగిడి యాభగవానుననుగ్రహంబులోఁ
జింతన సేసికొంచుఁ దనచేసినక్రించుఁదనంపుఁజేష్టకుం
జింతిలుచుక్ నదీతటముఁ జేరియటక్ మునుపట్ల ద్రవ్యపూ
ర్ణాంతరమైననావఁ గని యాత్మజనంబులు సంతసిల్లఁగన్.

ఉ. పిమ్మట నైనవృత్తమును జెర్కొని యచ్చటనే 'శుభస్య శీ
ఘ్ర'మ్మని సత్యదేవున కఖండపదార్థముతో యథావిధా
నమ్ముగఁ బూజ సేసి స్వజనంబుల నల్లునిఁ గూడి యాత్మదే
శమ్మున కేఁగ సంతసిలుస్వాంతముతోఁ బయనించె నోడపై.

వ. అట్లు పయనంబు సేసి తమయూరు సమీపించి యవ్వైశ్యుం
డల్లున కిట్లనియె. 107

క. అల్లుఁడ! మనరత్నపురం
బల్లదె కనుఁగొనుము! చేరువయ్యెం ద్వరగాఁ
జల్లగ మనయీయాగమ
నోల్లాసము దెలుపఁ బంపు మొక్కని దూతన్. 108

వ. అనవుడు నల్లుండును గోశాధిపతి యగు నిజభృత్యునిం
బుత్తెంచ. 109

ఉ. ఆవసుపాలకుండును మహాత్వరితంబుగ నింటి కేఁగి లీ
లావతిఁ గాంచి 'నిండుకుశలంబుగ నీవిభుఁ డల్లుఁ డిల్లిదే
నావపయిన్ ఘనంబగు ధనంబులతోఁ జనుదెంచువా'రనం
గా విని యావినీతయునగాధముదంబుధిఁ దేలియాడుచున్.

క. ఈకుశలవార్త దెలియుట
కాకరుణామయుఁడ హేతు వని తోడ్తోడన్

శ్రీకరుఁడు సత్యవిభునకు
సాకల్యంబుగ సపర్య సల్పి కడువడిన్. 111

ఆ. వలయుపనులు దీర్చి వచ్చువారల నెదు
రొక్కనఁగ సుతకు నిట్టు లనియె 'నమ్మ!
యేను బోవుచున్నదాన నిప్పుడ నీవు
వెనుక గాక రమ్ము వేగిరమ్ము.' 112

క. అని పిలువ నక్కళావతి
యును వేగిరపాటుతోడ నొం డెఱుఁగక దే
వనివేదితము ప్రసాదము
దిన కట్లన వోయెఁ బతిదిదృక్షాపేక్షన్. 113

చ. అటులు ప్రసాదభక్షణము నావలఁద్రోయుట కారణంబుగాఁ
దటుకున సత్యదేవుఁడు క్రుధాకలితుం డయి దాని కాపెక
ప్పటి కుచితంబు గాఁగ ధనభారవహంబగు నోడతోడఁబె
న్మిటిని ప్రవాహమధ్యమున నీటను ముంచెఁ గ్రమక్రమం
బునన్. 114

చ. పతి చనుదెంచె నంచు విని పట్టఁగలేనిముదంబుతోఁ గళా
వతి యతిసత్వరంబుగఁ బ్రవాహము డగ్గఱి వచ్చిరాక
ముక్, పతి యటు లేటిపాలగు విపద్దశ నొందఁగనయ్యె
నక్కటా!, మతిఁ దలపోయునట్టి దొకమాదిరి వేఱొక
మాద్రి దైవమున్. 115

వ. అంత నక్కళావతీకాంతయు భర్తృవియోగంబునకు విలపిం
చుచు. 116

చ. గతిపడి యంత కింతకు సుఖంబుగ వచ్చియుఁ గన్నులారనే
స్థితిగతి చూడకుండఁగనె చెల్లరె! యెల్లరకన్ను గప్పిపో
యితె? యిఁక నాథ! నాదుగతి యేమని యేడ్చుచు నేలఁ
బట్టెఁ దా; బ్రతికెడువారికిం జనెడువారికి నెవ్వరి కెవ్వరో
గదా! 117

ఉ. ఆఁక తొలంగి కంటఁ దడియాఱక మున్న ధనంబుపోక కిం
దాఁకఁ దపించి యింకఁ గడదాఁటితిమంచుఁదలంచునంతలో
వీఁక చెడంగ సాధునకు వెంటన దూపిల గోరుచుట్టుపై
రోఁకటిపోటుచందమున రోకము నల్లుఁడు మున్గినేటిలోన్.

వ. అప్పుడు. 119

క. ఆకోమటియును • మిక్కిలి
శోకోద్రేకమున బంధుసుదతులతోడన్
శోకించి కొంతసేపాక
జోకతమాయించి వెరవు చూచుచు మదిలోన్. 120

మ. తగురీతిన్ గడియాఁతకాండ్రవలనం దత్తీవ్రకూలంకషా
పగలోనం గడలున్ వలల్ వయిచి యావచ్ఛక్తి శోధించి పె
క్కగుసూత్రంబులఁజూచినంబడవచొప్పందంగ రాదయ్యెన
బ్భగవన్మాయ మనుష్యభేద్యమగునే పాలించి శోధించినన్?

ఉ. అత్తఱి సాధువుం గడిఁదియావగ నక్కట యింతలో నిజ
స్వాత్తుఁగ నెంత వంత యగఁజాట్లును గల్గె? నిదేమిచిత్రమం
చెత్తిలి క్రొత్తబెంగ గొని యెట్టెటులో విలపించుచుఁగూఁతున
య్యుత్తలపాటుచూచుటకు నోర్వఁగలేక తపించె నెంతయున్

తే. ఓడజాడ కనంబడ కుంటఁ జూచి
యోడవాండ్రును గోడాడి యాడి తుదకు
మనసు చెడి కుప్పగూలిరి యినుముతోడు
పాట్లు నగ్గికి సమ్మెటపోట్లు గాదె!. 123

తే. అంత లీలావతియుఁ దన చెంత వంతఁ
గుందుచుండెడు గారాబు కూఁతుఁ గాంచి
గర్భనిర్భేదకంపుశోకంబుతోడ
నంగలార్చుచు భర్తతో ననియె నిట్లు. 124

మ. అకటా! యెంతటిమందభాగ్యలమొ నాథా! యొప్పికన్
ద్రవ్యావే, టికలన్ భృత్యజనంబుచే బయటఁ బెట్టించుం
గదా! యల్లుఁ డింతకు మున్నె యిప్పు డెంతలోఁ బడవతోఁ
దామాయమ్మై పోయెఁ గన్యక నేలాగుభరింతు మింక
నెట్లులన్ ప్రాణాలతో నుందుమో. 125

శా. ధిక్కారం బెది యేని చేసితిమొ యేదేవుండు కోపించెనో
యిక్కార్యం బొనఁగూడినందులకు నే దే నిశ్చయింపంగరా
దొక్కండాత్మకుసత్యదేవకృతమైద్యోతంబగుం జూడఁగా
నిక్కంబింతయుఁ, దత్ప్రభావమునువర్ణింపంగనెవ్వారికిన్?

వ. అనియివ్విధంబున నవ్వైశ్యనిల్లాలు పుల్లసిల్ల వాపోవుచు.

ఉ. లేఁగి పయింబయిం బొటకరించెడునల్లునిజ్ఞాపకమ్ముచే
నాఁగనిశోకభారమున నాత్మజనంబులు చుట్టుపట్టునన్
మూఁగ నెలుంగు నెత్తి తనముంగిటనేడ్చెడునక్కళావతిం
గౌఁగిటఁ జేర్చికొంచు సతిగా విలపింపఁ దొడంగె దీనయై.

క. అంత. 129

వ. తహతహ పట్టలే కుటిదిక దక్కి కళావతి నాథుఁ డీల్గుచో నిహపరదూర మైనతనువియ్యదియేలొకొ యోఁవిరాగతా బహుళతచే నిజేశ్వరునిపాదుకలం గొని సాహసంబునన్ సహగమనంబు సేయుటకుఁ జయ్యనఁ బోఁ దలపోయుచుండఁగన్. 130

ఉ. లోఁతగు శోకవారినిధిలోఁ బడి ముద్దెడుతల్లిదండ్రు ల క్కూఁతుతలంపుతెంపు గని గొల్లున నేడ్చుచు నెట్టకేలకా చేఁత దొలంగునట్టులుగఁ జేసి లలాటమునన్ విధాతచే వ్రాఁతయిటుండెఁగా యని యపారముగావిలపించిరిట్లుగన్.

మ. ఒకకర్మంబు నెఱుంగదే! యొకసుఖంబొందంగలేదే! యొకా నొకనోమైనను బట్టలేదె! కడ కేమో కన్నదోషాన వే డుకలం జూత మటన్నమాస్పృహలు గట్టుం జేరవే! యింతలో, నకటా! యొక్కడ దాపరించె నిటు లర్థా యుష్యుఁ డీబిడ్డకున్. 132

వ. ఇట్లు విలపించుచుం గొండొకసేపటి కయ్యార్యుండు ధైర్యం బు తెచ్చుకొని తనయిష్టదైవంబగు సత్యనారాయణస్వామిం దలంచుకొనుచు. 133

ఉ. ఈయది సత్యదేవకృతమే యగుఁగాని మఱొండుగాదు త న్మాయమెఱుంగుచే నిటు భ్రమంపడిపోయితి; నింక మీఁదన త్త్యాయతవైభవంబు చెలువారఁగఁ బూజలొనర్తుసత్యదే వాయనమోస్తు తేయనిసభక్తిఁగృతాంజలియౌచు వేఁడుచున్.

వ. ఆ ప్రజనంబులం జీరి చెప్పుచున్నంత. 135

మ. కరుణాసాంద్రుఁడు దీనపాలుఁడు సదాకల్యాణశీలుండు వ
వ్వరదశ్రేష్ఠుఁడు సత్యదేవుఁ డటు లావ్యాపారి వేఁడంగ స
త్వర మానందము నెంది లో నఖిలభూకాంతశ్రేణికిం దానగో
చరుఁడై యివ్విధమానతిచ్చె జనులాశ్చర్యంబునుం బొందఁగన్.

ఉ. నీసుత భర్తృదర్శనము నెమ్మదిఁ గోరి ప్రసాద మావలం
ద్రోసియి ఱేఁగుదెంచుటను రోకముతోఁ డదదీయభర్తయు
న్నాసెను గాన నిష్ఠ భవనంబున కేఁగి ప్రసాద మాని తా
డా సెనయేని తప్ప కవికడంబముగాఁ బతిదృశ్యుఁ డయ్యెడిన్.

తే. ఈరహీని వినంబడునశరీరవాణి
వినినయంతఁ గళావతియును బిఱాన
నింటి కేఁగి ప్రసాదంబు నెలమిఁ గ్రోలి
తిరిగి యచ్చోటునకు నేఁగుదెంచునంత. 138

చ. పొలకువ గానిపించి పెనుభూతముగాఁ గనిపించి యో
డరూ, పలరఁగ నించి యించుక జలాగ్రమునన్ మొన
సూపి యంత మిక్కిలి యయి లోజనంబు వెలికిం గనఁజేసి
క్రమక్రమంబుగాఁ, దొలిక్రియ నీటిపైఁ బడవ తూర్ణమ
లేచె జనంబుకోర్కితోన్. 139

వ. అట్లు నౌకాసహచరులతోడం గుశలంబుగ లేచి కని
పించెడు నిజనాథునిజాడం గాంచి భగవత్ప్రభావంబు
దలంచి మేధావతియగు నక్కళావతి తండ్రి కిట్లనియె. 140

తే. జనక! 'యాలస్య మమృతం విష' మ్మటండ్రు
గనుక నిప్పుడ మనము వేగంబ యింటి
కరిగి శ్రీసత్యవిభువ్రతం బాచరింత
మిట్టితఱి జాగు గూడ దొక్కింతయేని. 141

క. అని మఱి మఱియును గూఁతురు
తనుఁ దొందరపెట్ట సెట్టి త్వరత్వరగ గృహం
బునకు మహావిభవంబుగఁ
జని సత్యవ్రతము సేయు సంకల్పముతోన్. 142

సీ. తులకించు వెల మించు లలి మించు గలిగించు
వలయునానావస్తువుల నమర్చి
తనవారిఁ బనివారి దనయూరి ఘనసూరి
జనవారమును రాఁగఁ బనిచి తెచ్చి
యురువిద్యగురుహృద్యతరవాద్యనిరవద్య
వరమంగళధ్వనుల్ నెరయఁ జేసి
ముదివోని కొదగాని మదిఁ బూని తుదిలేని
పదిలంపుభక్తిని బదిలపఱచి
తే. నిండువైభవ మెసలార నిష్ఠ మీఱ
సకలవాంఛితములు దీర సుకృతకార
ణంబు శ్రీసత్యనారాయణవ్రతంబు
దండిగా సల్పెఁ గన్నులపండువుగను. 143

వ. అంతం దద్వ్రతమాహాత్మ్యమ్మున. 144

చ. కలిగి సమస్తసంపదలు గాంచి సుతాదుల న్యాయవృత్తిచే
జెలఁగి ప్రశస్తధర్మహితశీలములై పచరించి లోభముం
దలఁగి రమాధినాథుని వ్రతంబునకుఁ హితుఁడై జగంబులో
మెలఁగి యిహప్రపంచసుఖమేదురభోగము లొందె వై
శ్యుఁడున్. 145

క. అది మొదలుగఁ బ్రతిపూర్ణిమ
వదలక భయభక్తు లలర వ్రతము సలుపుచుం
జెదరనియిహసుఖములఁ గని
పిదపను శ్రీవిష్ణుపురము పేర్మిఁ జేరెన్. 146

క. అని వినిపించిన నైమిశ
మునివర్యులు తనివి సనక మునినేతను సూ
తుని గని పునఃపునఃప్రా
ర్థనముల విన వేడుటయు మఱలఁ దన్మహిమన్. 147

ఆశ్వాసాంతము.

శా. సత్యాసత్యనిరూపణక్రమనిదర్శప్రాయనిర్ధారణా!
కృత్యాకృత్యగుణాగుణప్రకరణోత్కృష్టాయనోద్ధారణా!
నిత్యానిత్యపదార్థసంస్కరణనిర్నిద్రాతిధీధారణా!
భృత్యాభృత్యసుఖాసుఖాత్మచరణా! శ్రీసత్యనారాయణా!

భుజంగప్రయాతము.
శుభోద్దామకారుణ్యశుంభన్నిధానా!
ప్రభావాతిరేకప్రభాభాసమానా!
యిభేంద్రార్తివిచ్ఛేదనైకావధానా!
స్వభక్తావనాధీన! సత్యాభిధానా!. 149

గద్యము.

ఇది శ్రీమత్సకలదేవతా ప్రసాదిత శ్రీబాలామేధాదక్షిణా మూర్తి మహామంత్రోపాసనాసాదిత సంస్కృతాంధ్రకవితా సామ్రాజ్యపట్టభద్ర కావ్యతీర్థ బిరుదముద్ర మద్దులపల్లి వంశ పయఃపారావార రాకాతారాకళత్ర నృసింహాసిద్ధాంతి పుత్ర విద్వత్కవిజనానుగుణ్య వేంకటసుబ్రహ్మణ్యకవి ప్రణీతం బైనసత్యనారాయణమాహాత్మ్యం బనుపుణ్యప్రబంధంబు నందుఁ జతుర్థాశ్వాసము.



శ్రీః

# సత్యనారాయణమాహాత్మ్యము.

## పంచమాశ్వాసము.




కర! సౌభాగ్యాకర!
ప్రాకృతజనతాభయంకరవ్యాపారా!
నాక భవానీ వాగ్గిగ
నీకాధిపసన్నుతాంఘ్రి! నీరేజధరా! 1

వ. అవధరింపు మట్లు వేఁడినంత నిఖిలరహస్యవిజ్ఞాత యగు
సూతమునినేత నైమిశారణ్యమునివరేణ్యుల కిట్లనియె. 2

క. సంగరరంగజయశ్రీ
మంగళలీలాకటాక్షమాలావాలో
త్తుంగాభంగయశోధ్వజుఁ
డంగధ్వజుఁ డనుమహాధరాధిపుఁ డుండెన్. 3

ఉ. ఆలలితస్వభావుఁడు మహావిభవోన్నతుఁ డుర్వరాప్రజా
పాలనతత్పరుం డతికృపామతి శ్రీసురభూసురార్చనా
శీలుఁడు రాజనీతిపరిశీలనబుద్ధియు నిద్ధశాస్త్రవా
చాలుఁడు త్యాగభోగుఁడు ప్రశస్తగుణస్తవనీయుఁడై తగుఁ

శా. ఆభూపాలుఁడు సార్వభౌముఁ డయి సప్తాంగాఢ్యసామ్రా
జ్యల, క్ష్మీభోగానుభవంబుతో జగతి శాసింపంగ వర్ణా
శ్రమ, శ్రీభాభావము గాఁగ దేవ గురు శుశ్రూషావిశే
షప్రతి, ష్ఠాభిష్వంగముతోఁ బ్రవర్తిలు. జనం బాబాల
గోపాలమున్. 5

వ. ఇట్లు దండిగ నిండుభోగంబు లుండునవసరంబున. 6

ఉ. ఆవసుధాధినేతయు మహత్తరకర్మముచే 'వినాశకా
లే విపరీతబుద్ధి' యనులీల నొకానొకానివేళ శ్రీ
దేవుప్రసాదముం గొనక దృప్తతచేతఁ దిరస్కరించి తాఁ
బోవనిదుఃఖశోకములఁ బొంగెడుసంకట మొందె నెంతయో

వ. అ దెట్టు లనిన. 8

ఉ. ఆనరనాయకుండు మృగయార్థ మొకానొకనాఁడు సేనతోఁ
గానకుఁ బోయి యందులమృగంబుల మొత్తము వేఁట
లాడి యెం, తేనియు డస్సి క్రమ్మఱి దినేశ్వరుతాపముచేత
నొక్కఛా,యానిబిరీస మావటమహాతరుసన్నిధిఁ జేరి
యచ్చటన్. 9

మ. కృతులా కొందఱు గోపశేఖరులు భక్తిన్ సత్యనారాయణ
వ్రతముం జేయుచునుండఁగాంచియును జేరంబోకదర్పాతిరే
కతఁ జేమోడ్చినమస్కరింపకయ మార్గశ్రాంతినిం దేలుచున్
వెతలం జెందుటకే మొకావలయు గాంభీర్యంబుగానుండుచోన్.

ఉ. వేగిర మావ్రతంబు నెఱవేఱిచి గోపకులుం బ్రసాదమున్
బాగుగఁ బళ్లెరంబున నృపాలునిసన్నిధిఁ బెట్టి తారునున్

భోగము సేయనాతఁడు కుబుద్ధిఁ బ్రసాదము మాని యేఁగెడా
భోగవినాశకాలమునఁ బుట్టెడుఁగా విపరీతబుద్ధులున్. 11

వ. అట్లు ప్రసాదమ్మున్ దిరస్కరించి యేఁగునంతలో సత్యదేవ
ప్రభావంబున. 12

చ. నిలయము సేరునప్పటికి నీల్గిరి పుత్రకు లున్న మూర్గఱుం
దలఁగెను భాగ్యలక్ష్మి ధనధాన్యము లన్ని నశించె మిఱఁదుమి
క్కిలినగుఁ బాట్లచేటు కలిగెం గలుగంగ నిటొక్కమాఱుగా
విలయ మిదే మటంచుఁ బృథివీపతి కొండొక శోకతప్తుఁడై.

వ. కొండొక్కసేపునకు హృదయంబు కుదుటపఱచుకొని తన
యకృత్యంబులం దలంచుకొనుచు స్మృతిపథంబునకుం
దెచ్చుకొని. 14

ఉ. నిక్కముగా నిదంతయును నెంజిలి దైవకృతంబ కాని వే
ఱొక్కటి గాదు; నాదురితయోగబలంబునఁ గాననంబులో
నక్కడ సత్యదేవుని వ్రతాచరణం బొనరించుచోటికిం
ద్రొక్కక మ్రొక్కకం దవలఁద్రోసి ప్రసాదమునింద సేసితిన్.

వ. కావున. 16

శా. దైవద్రోహము సేసినందులకు సత్యస్వామియే పెద్దక్రో
ధావేశంబున నింత సేసినను జేయన్ వచ్చు నిక్కం బిదే
వేవేగన్ వ్రతభూమి కేఁగి యిపుడా విఖ్యాతమౌనాపదల్
వోవంగా శరణంబు సొచ్చి భగవత్పూజల్ నివర్తించెదన్.

మ. అని సంకల్పము సేసి వేగిరమ డాయం బోయి గోపాలురన్
గని తాఁ గన్న విపత్తుచెప్పి యొకట న్వాపోయి కొండొక్కసే

పునరుం దెప్పిటి వారలంగలసి సంపూర్ణంబుగా నందుహె
చ్చినభక్తిఁ భగవంతు సత్యవిభుఁ బూజించెఁ యథాశక్తి
గన్. 18

వ. అంతం దన్మహిమప్రభావంబున. 19

క. మృతు లగుమార్గులు కొమరు
ల్బ్రతికిరి విడిచనినభాగ్యలక్ష్మియుఁ జేరెఁ
గతధనధాన్యములు యథా
స్థితి సమకూడె నగుఁబాట్లు చేటుం దొలఁగెన్. 20

వ. అంత భగవత్ప్రభావంబున కచ్చెరువడుచుఁ దద్విధేయుండై.

ఉ. శ్రేణిగ సత్యదేవువ్రతసేవలు సేయుచు, రాజ్యలక్ష్మియుఁ
రాణఁ జెలంగ మంగళపరంపర పెంపువహింప సొంపు వి
న్నాణము మీఱ నద్ధరణినాథుఁడు వైభవ మార నిత్యక
ళ్యాణము పచ్చతోరణములై తగ వర్ధిలెఁబెద్ద కాలమున్.

క. ఈగతి నభ్యుదయుఁ డిహ
భోగంబుల ననుభవించి పొందెను బిదపఁ
సాగరశయానుసత్కృప
భోగాభోగాస్పదంబు మోక్షపదంబున్. 23

ఫలశ్రుతి.

తే. పరమదుర్లభ మిష్టార్థఫలదమైన
యీవ్రతము నాచరించిరయేని భక్తిఁ
గథ వినిరయేని శ్రీనాథుకరుణచేత
నైహికాముష్మికసుఖంబు లబ్బు నెపుడు. 24

క. మఱియును నిస్సంశయముగ
నిఱుపేద ధనంబు వొందు నిర్బంధితుఁడుం
జెఱ వదలు భీతుఁ డగున
త్తఱి భయమును బాయు సత్యదైవముకరుణన్. 25

క. ఈకరణి నిహసుఖమ్ము ల
నేకమ్ములు వొంది చెందు నిర్యాణమునన్
శ్రీకైవల్య మతులసుఖ
సాకల్యము జన్మపుణ్యసాఫల్యంబున్. 26

ఆ. శౌనకాదిమానిసత్తములార! యొ
ద్దానిఁ జేసి దుఃఖతాప మిాఁగు
నరుఁడు; దాని సత్యనారాయణవ్రత
మిాకు వినిచినాఁడ నింతవట్టు. 27

వ. మఱియును. 28

మ. కలికాలంబునసత్యదేవవ్రతమొక్కండెక్కుడై మిాఁదుమి
క్కిలి యిష్టార్థఫలప్రదంబగును;సంకేతింతురొండొక్కవా
రలు శ్రీసత్యవిభుం డనంగ నవతారం బెత్తి సర్వేశుఁడ
క్కలిదోషంబులఁ బీఁచమార్చు నని నిక్కంబైనజ్ఞానం
బునన్. 29

ఉ. వేయును బల్కనేల? పృథివీస్థలిలోఁ గలికాలమందు నా
రాయణుఁడే దయాళువు పరాత్పరుఁడంచఱఁబ్రోవసత్యనా
రాయణదివ్యరూపధరుఁడై పలురూపములన్ ధరించి శ్రే
శ్రేయససంపదాదికవిశేషవిభూతు లొసంగుచుండెడిన్. 30

క. శ్రీ రాజిల్లెడుపుణ్యక
థారాజము దీని భక్తిఁ దాత్పర్యముతోఁ
బారాయణంబు సేసినఁ
గోరికవెంయి విన్నఁ బాపకూటము లడఁగున్. 31

ఉ. వాణివలెన్ సమస్తకవివాక్పతి లాలనపాత్ర మాచురు
ద్రాణివలెన్ సదాశివవిధానవిదానపదంబు నొచు శ్రీ[యుం
రాణివలెన్నృసింహమతిరంజనియౌచుమహేంద్రభోగ
ద్రాణివలెన్ మదీయకవితాసుకుమారకుమారివొల్చుతన్.

ఆశ్వాసాంతము.

శా. శ్రీవైకుంఠనివాస! వాసవనుతాంఘ్రిద్వంద్వ! ద్వంద్వా
దిభావావేశప్రతికార! కారణవిహీనా! హీనలోకాళిర
క్షావిఖ్యాతవిచార! చారణగణాఖ్యాతాత్మ! యాత్మాశ్రయ
జీవంజీవవిధూ! విధూతకలుషాధివ్యాధిబాధావిధా! 33

స్రగ్విణి.
వేదవేదాంతవిద్వేద్యదివ్యస్థలా!
నాదబిందుప్రధానస్ఫురత్సత్కలా!
పాదపంకేజసేవాజనుర్మోక్షణా
సాదనప్రాపణా! సత్యనారాయణా! 34

గద్యము.
ఇది శ్రీమత్సకలదేవతాప్రసాదిత శ్రీబాలమేధాదక్షి
మూర్తిమహామంత్రోపాసనాసాదిత సంస్కృతాంధ్రకవితా

సామ్రాజ్యపట్టభద్ర కావ్యతీర్థ బిరుదముద్ర మద్దులపల్లివంశ పయఃపారావారరాకాతారాకళత్ర నృసింహసిద్ధాంతిపుత్ర విద్వత్కవిజనానుగుణ్య వేంకటసుబ్రహ్మణ్యకవిప్రణీతంబైన సత్యనారాయణమాహాత్మ్యం బనుపుణ్యప్రబంధంబునందుఁ బంచమాశ్వాసము.

సర్వము సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ

మ. శకవర్షంబులు త్రి ద్వి నాగ వసుధాంచ (౧౮౨౩) చ్ఛార్వరిశ్రావణ
ప్రకటశ్యామచతుర్దశీ గురుదినప్రాహ్ణంబునం బుట్టి పై
వికసంకల్పముచేతఁ గ్రోధనతపోశ్వేతాఖ్యపక్షద్వితీ
యను సమస్కృతి సత్యదేవునకు నే నాసించి పూరించితిన్.



చెన్నపురి : వావిళ్ల ప్రెస్సున ముద్రితము.